# నిశ్శ్రేయసానందము

విద్వత్కవిరత్న
ముత్య సుబ్బారాయ దైవజ్ఞమణిచే
రచియింపబడి,

శ్రీ మంతెన సత్యనారాయణ రాజుగారి
(చెరుకుమిల్లి P. B. ప్రెసిడెంటు)
సంపూర్ణసహాయమున గ్రంథకర్త గారిచే ముద్రింపబడినది

1953

కమలకుటీర్ ప్రెస్,
నరసాపురం.



వెల 1-0-0

# పీఠిక.

విద్వత్కవిరత్న శ్రీ ముత్య సుబ్బారాయకవిగారి నూతనసృష్టి యగు "నిశ్శ్రేయసానందము" నాంధ్రజాతికి బరిచయముచేయు భాగ్యము గల్గినందులకు సంతసించుచున్నాడను. రసరీతి వృత్త్యలంకారాదులచేతను కథాసంవిధానకౌశలముచేతను, భాషాపాటవముచేతను పాత్రపోషణాచాతుర్యముచేతను, సకలజనచేతోమోదకరము, నున్నతాదర్శప్రదర్శకమునునైన యీకావ్యము కవిగారి యితర కావ్యముల సంప్రదాయము ననుసరించి, వివేకబోధకమై యలరారుచున్నది. ఈ గ్రంథమున నిస్సారమైన పద్యమెందునకైనను గానరాదు. ఏదోయొక చమత్కారమో, అలంకారమో యుత్కృష్టనీతిబోధయో మానవప్రకృతి పరిశీలనమో, బాహ్యప్రకృతి వర్ణనమో, లోకోక్తియో రచనాప్రాగల్భ్యమో లేని పద్యమిందు గన్పట్టదు. లోకోక్తులు, నీతులు, భావానుకూలభాషాగతులు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు శ్లేషలు ప్రౌఢకల్పనలు, ప్రాసపాటవము ప్రత్యేకరచన జిహ్వానిరోష్ఠ్యము వంటి చిత్రకవిత్వములు పెక్కులిందు గన్పట్టగలవు. భాషలలితము. భావగుంభనదృశము నిరుపమమును.

ఈ కవితల్లజుని కవితాప్రావీణ్యమునకు జోడైనది. కథాసంవిధానకౌశలము. దీనిని చదువ బ్రారంభించిన తొలుదొల్త గ్రీకురాణి యగు క్రిసెల్డా, నామదికి గోచరమై పిదప మాయమైనది. ఆమెకథ వలె దుఃఖాంతముగాగాక మిక్కిలి యద్భుతముగ సుఖాంతముగా నిది చిత్రింపబడినది. ప్రతిపాత్రమును తీర్చిదిద్దినయట్లుండి వివేకమును వెదజల్లుచున్నవి.

సతీపతిధర్మములు, రాజధర్మములు, సచివధర్మములు, మానవధర్మములు, ధర్మవిజయము మున్నగునవిందు చక్కగా వెలయింపబడినవి. ఈ గ్రంథము విద్యార్థులకు భావభాషాభివర్ధకమగుటచే పాఠ్యగ్రంథముగ సర్వవిధముల తగియున్నది. ఇది విద్యార్థులకేకాక విజ్ఞానపిపాసువులకును విందొనర్చుననుట సుంతయు నతిశయోక్తి కానేరదు. చదువుకొలదియు పాఠకులే యిందలి గుణములు గ్రహింపనేర్తురుగాన విస్తరభీతిచే నిందువ్రాయవిరమించుచున్నాడను.

జటావల్లభుల పురుషోత్తం M. A.

ఓం

# యోగ్యతాపత్రమ్.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యయమనియమాద్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠ, తపస్సంపన్న, సకలనిగమాగమసార హృదయకాండత్రయ ప్రవర్తక, భక్తకార్యకల్పద్రుమ, సర్వతంత్ర స్వతంత్ర పరమపావనీయ ద్రవిడదేశాంతర్గత చిత్రానదీతీర త్రికూటాచలక్షేత్రవాస, శ్రీదత్తాత్రేయ మఠాధీశ శ్రీసిద్ధేశ్వర పీఠప్రతిష్ఠాపనాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాద పద్మారాధక, శ్రీమౌనానంద స్వామి పర్యాయపద విరాజమాన శ్రీశ్రీశ్రీ శివచిదానంద సరస్వతీ స్వామినామాజ్ఞానుసారేణ శ్రీసిద్ధేశ్వర పీఠాధిష్ఠితానాం అనేక భాషాకోవిదానాం శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళీ విరాజమానానాం శ్రీశ్రీశ్రీ జగద్గురు విమలానంద భారతీస్వామినాం కరకమల సంజాత శ్రీకుర్తాలపీఠాధీశ్వర శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీత్రివిక్రమ రామానంద భారతీస్వామిభిః, అనేకమండల దత్తధర్మోపన్యాస విరాజమానైః.

పశ్చిమగోదావరీ మండలాంతర్గత శ్రీరామపురీ వాస్తవ్యస్య శ్రీముత్యంశెట్టిపవనస్య సుబ్బారాయశర్మణే జ్యోతిషకవిత్వ వేదాంత శాస్త్రేషు ప్రజ్ఞావిశేషం పండితసమక్షం ప్రత్యక్షీకృత్య ముదా నారాయణస్మరణపూర్వకే ఆశీర్వాదపురస్సరేచ దత్తే ఇమే బిరుదే.

(1) దైవజ్ఞమణి (2) విద్వత్కవిరత్న ఇతిచ ఇతి నారాయణస్మరణమ్

శ్రీత్రివిక్రమ రామానందభారతీస్వామి

శ్రీసిద్ధేశ్వర పీఠాధిపతి, కుర్తాళము. తిరునల్వేలిజిల్లా

లైఫ్ ప్రెసిడెంటు, శంకరవిద్యాలయము బాపట్ల.
శ్రీరామపంచాయతన బ్రహ్మవిద్యాలయం; అనకాపల్లి.
శ్రీవేదపరిషత్. విజయనగరం; శంకరమఠం. విజయవాడ.

# విజ్ఞప్తి

కం. పదితొమ్మిది వందలము
ప్పదియాఱవ వర్షమందె ప్రభవంబగు ని
య్యది వచ్చెనేటి కచ్చున
కు, దయన్ నెచ్చెలులు హెచ్చుకూరిమిఁ దేరన్.

మ. స్వకృషిన్ వేగముఁగించినన్ గని తమిన్ బద్యావళిన్ వ్రాయఁజే
యకనిదిగింపని గణ్యుఁడౌ గిడుగువంశాంబోధి చంద్రుండు జా
నకి రామాఖ్యునికిన్ గృతజ్ఞుఁడనుతన్ మాన్యాత్మసాయానఁ గా
కిఁక నేనీపదునేను వర్షములలో నేకావ్యమున్ వ్రాయుమిన్.

మ. వశమా నాకనకిచ్చునాడెకొని కావ్యంబచ్చునందెచ్చి భ
వ్యశుభోక్తిన్ ననుగౌరవించిన లసత్వంగూరి వంశాంబురా
శి శరత్కాల నిశాతుషార నిలయున్ శ్రీనారశింహాహ్వయున్
దశదిగ్వ్యాప్తయశోవిశాలుగదయన్ దైవంబుకాపాడుతన్.

కం. స్ఫుటభక్తి నీశువేడెద
నవ కమలకుటీర ముద్రణాలయనాథుం
ద[illegible]కున సమయామునకు నా
కు సాయంబైన సఖులనెల్లర బ్రోవన్.

మ. అనుబంధమ్ముగ వ్రాసి చేర్పఁబడు పత్రాళిన్ గడున్ వేగ ము
చ్చునకున్ దెచ్చుట హెచ్చుసాయపడు సంశుద్ధాంతరంగాన బొ
ల్చిన యాకేసరి ముద్రణాలయ విభున్ శ్రీపైడిమర్యాఖ్య వం
శ్యుని నైశ్వర్యము లిచ్చిబ్రోచుహరి శ్రీసూర్యప్రకాశాహ్వయున్.

గీ. ఎంతజాగరూకతతోడఁ నేర్పఱిచిన
నచ్చుతప్పులు దొర్లంగ నయ్యెవిందుఁ
దుదిని జేర్పంగఁబడియె వానిదయఁగాంచి
కలుగు శ్రమకు క్షమింతురుగాత బుధులు!

శా. శ్రీరమ్యమ్ము బుధాళిగమ్యము గుణశ్రీసౌవ్యముల్ బండితా
ళీరాజన్నిలయమ్మునౌ చెఱకుమల్లి గ్రామమందెన్నికన్
మీఱంగల్గిన క్షత్రియాన్వయమునన్ జెన్నొందుశ్రీ మంతెన
స్వాగోద్వంశమునన్ యశంబుఁగనెఁ బ్రజ్ఞన్ బద్మరాజెంతయున్.

మ. క్షితివిఖ్యాతి వహించిమించిన ఘనుండౌ పద్మరాజాఖ్యుఁడా
ద్యుతిసీతాసతియందుఁగాంచె సుతులన్ ద్రేతాగ్నులో యుంచుఁ గీ
ర్తిత్రిమూర్తిత్రయమో యటంచు జనులార్వన్ స్తోత్రముల్ సేయఁగా
నతుల ప్రాభవులైన ముఖ్యవరను విఖ్యాత ప్రభావాఢ్యులన్.

సీ. వీరిలో జ్యేష్ఠుండు వేంకటపతిరాజు
వితరణ ఖనియంచుఁ బేరుఁగాంచె
ధీరుఁడందు ద్వితీయుఁడౌ రంగరాజాఖ్యుఁ
డతిదైవపరుఁడుగా యశముఁ గాంచె
నమలుఁడంతఁ దృతీయుఁడగు దుర్గరాజాఖ్యుఁ
డుదకంబులిడి కృషులొనరఁ బెంచె
స్థానిక సంస్థలీతని వరియింపఁ బ్ర
సిద్ధకార్యము లెన్నొ చేసి మించె
నందురంగరాజాఖ్య సౌమ్యగుణపేటి
కమల లక్ష్మీనరసమాంబ యందుఁ బొడమె
ప్రథితరఘురామచింతాపరాయణుండు
ప్రణుత సుగుణుండు సత్యనారాయణుండు.

సీ. భూపతిరాజు లక్ష్మీపతిరాజాఖ్య
దాతయే వాని మాతామహుండు
వేంకట నరసాఖ్య విశ్రుతవిమలగు
ణాఢ్యయే వాని యమ్మమ్మగారు

వేంకటకృష్ణరాజాంకిత యాచక
త్రాతయవని జ్యేష్ఠమాతులుండు
ప్రథితవేంకటనృసింహరాజాఖ్య సద్గుణ
మణియెవ్వని ద్వితీయ మాతులుండు
నట్టి సద్గుణవ్రాతు దయానమేతు
భవ్యగుణపూతు క్షత్రియవంశజాతు
నార్తసుర భూజునుతియింతు నమలతేజు
నలఘు తరసత్యనారాయణాఖ్యరాజు.

శా. లేఖోల్లక్షణమండితంబయిన బల్ పెన్మెత్స వంశంబునన్
ముఖ్యుల్ బండితకీర్తితాఖ్యురసదీప్తున్ సూర్యనారాయణ
ప్రఖ్యాతోన్నత రాజపుంగవుని విద్వత్సోభితుల్ మామగా
విఖ్యాతింగొనె నీమహామహుఁడు సంప్రీతాత్ముఁడై యెంతయున్.

ఉ. మాయురె! యేమి తెల్పనగు, మంతెన వంశపయోధిచంద్రుఁడై
శ్రీయుతుడున్ సుధీయుతుడు శిష్టజనస్తుత సద్గుణాఢ్యుఁడున్
న్యాయపథానువర్తియున నంతయశోన్వితుఁడైన సత్యనా
రాయణరాజధీరుని మహత్తర సచ్చరితాప్రశస్తిలిల్.

మ. జనవిత్తప్రబలాఢ్యుఁడయ్యుఁ గనఁడీషన్మాత్రదర్పంబు, సా
గినన్ జేరఁ డధర్మపద్వ్యసను, ఁ జరక్షించుంబె కాంక్షించు, ని
త్యసిరాడంబరజీవియై మను ననంతాత్మ్యోన్నతిన్ గ్రాలి; కా
వున నంచాయుతిబోర్డు పొందువిడ కెప్డున్ వీరిఁ దన్నాథుగన్.

కం. సిరియును వాణియు నొక్కట
వరలరు భువినన్న వార్త వమ్ముగ మిగులన్
సిరినొంది కావ్యవిదుఁడై
కరమరుదుగదనరుసీ యఖండ గుణుఁడిటన్.

శా. ఆసామ్రాజ్యాత్మని లేమ యమప్రీమురాలౌ నా యశంబొందుల
క్ష్మీసీతాఖ్యను దైవభక్తిఁ బతిభక్తిన్ దీనదాస్యాదర

జ్ఞానసక్తిన్ వరదానశక్తి ఘనవిద్యారక్తి యుక్తిన్ మహా
ల్లాసం బేసమయంబునం దెసగి కల్లల్ లేని సచ్ఛీలయై.

ఉ. ఆయిలు సొచ్చివచ్చు ప్రతియాచకుఁ డర్థియు బందుగుల్ సఖుల్
శ్రీయుతులైన నిర్ధనులు శిష్యులపండితులైనఁ గూడ యా
హాయని హాయినొందుచు దదర్పిత సత్కృతి గౌరవాదరా
మేయవిధానముల్ గుఱిచి మేలుగఁ బల్కుదురెల్ల కాలమున్.

గీ. ఆసతీపతులిరువురు నఖిలసద్గు
ణాళినొకరొకరిని మింతురందుమరియు
కేవలము రామగుణసీమ గీముగోము
ప్రేమనోము నేమరకేమి క్షేమమలర

కం. మచ్చునకుఁ బొంపుననవే
పొచ్చెములేనట్టి సుగుణమూర్తుల గనెనా
యచ్చపుయుగ్మము ముచ్చట
హెచ్చగ పుత్రునొక పుత్రినెల్లరు బొగడన్.

చం. తనయుఁడు రంగరాజు విబుధస్తుత సద్గుణుఁడౌచు నాంగ్లవి
ద్యనుఁ గొనుచుండెఁబట్టము, సుతామణి సీతయు సీతయైస్వవ
ర్త్మసుభ యావంశకీర్తులఁ గరమ్ముఁదిరమ్మధికమ్ము జేయు వీ
రిని సుఖసంపదాయువులఁ బ్రేమనుఁ బ్రోతురుగాత దేవతల్!

ఉ. ఆయులఘుప్రవర్తనుఁ డుదంచితకీర్తియుతుండు సత్యనా
రాయణరాజ నామవిమలాత్ముఁడు నేరచియించినట్టి వి
శ్రేయస సచ్చరిత్రమును ప్రేముఁడీ నచ్చునఁదెచ్చు మూల్యమ
త్యాయతలీల నిచ్చుటకు నాస్థనుఁ జూపెసముత్సుకంబునన్.

శా. ఆయుస్సత్త్వసుఖాయురున్నతులు సమ్యగ్లీలఁ బెంపొందగా
నాయీశాది సమస్తదేవతలు ప్రేమానంద పూర్ణాత్ములై
సాయంబాదురు గాక వీరలకు నీసద్వంశ జాతాళికిన్,
గేయంబైన ప్రసిద్ధకార్యతతులన్ క్షేమంబిడన్ ధాత్రిస్థలిన్.

శా. శ్రీవాణీశ రమేశ శీతనగజాచేతోధవుల్ భూరిధీ
ప్రావీణ్యంబుల నీజగాలసృజియింపన్ బెంపనుంపంగ నే
భావాతీతుఁడు నిల్చి వారిఘనసేవల్ పొందునామూర్తి నా
కేవేళన్ విజయోన్నత ప్రదుడుఁగా నెంతేనిఁ గాపాడుతన్.

శా. శ్రీమద్దివ్యమునీంద్ర సేవితలసచ్చిన్మాత్రుఁడున్, నిత్య ని
ష్కాముండాద్యుఁడు నామరూపగుణ నిస్సంగుండ జుండున్ జగ
ద్ధాముండయ్యును ధర్మరక్షణకు నిత్యంబున్ బ్రయత్నించు శ్రీ
రాముండీకృతి నెల్లకాలమును సంరక్షించు నాతన్ గృపన్.

కం. గణనాయకరూపంబున
గణుతింపఁగఁ బరుచు విఘ్నగణ వారణకా
రణచనుఁడై తగుపీశుచ
రణమెంచెద నాదు కృషికరమ్ము ఫలింపన్.

చం. అనులినలీల నాదుహృదయాంతర పీఠమునందు నీదు ది
వ్యనుపితరూపమున్ నిలిపి ప్రాంచితభక్తి నుతించెదన్ భవ
ద్వ్యపుల కృపార్ద్రదృష్టి సను వేఁగని నాకులలిన్ స్రవింపఁజే
యుము సుకవిత్వధారను మహోత్తము లెల్లరు మెచ్చ భారతీ!

మ. సరసజ్ఞాన కవిత్వ చూతవిటపీశాఖాస్థితంబై నిరం
తరమున్ నిస్తుల రామనామ మధురోద్యన్నామ గానంబు సుం
దరలీలన్ దిశలెల్ల హాయిగొన దద్దన్ జేయు వాల్మీకి భా
స్వర సత్కోకిల నాశ్రయింతు సుకవిత్వంబబ్బ నత్యంతమున్.

కం. వేదపయోనిధులన్నిటి
మేదురమతిమె మధించి మేలగు సారం
బాదృతి కవితల గూర్చిన
యాదివ్య కళా విలాసు వ్యాసునుతింతున్.

గీ. తక్కుఁగగు సంస్కృత కవీంద్రతతికి మ్రొక్కి
యాంధ్రకవినేత లెల్లరు నభినుతించి

కం. ఆ వేంకటరామునకును
నా విమలుని వెలది సుబ్బమాంబకు గొడుకుల్
దేవిత్రితయంబనగా
నావిర్భవ మొందిరి మువురాత్మజులలర్.

గీ. ధాత్రికవులలోన విఖ్యాతి దాన
ధర్మములుఁజేసి మించిన దైవసముఁడు
మాన్యగుణుడు సుబ్బారాయ మహితకీర్తి
యాలమి వేంకటరాముని జ్యేష్టసుతుఁడు.

ఉ. శ్రౌతమునాదు స్మార్తమునఁ జక్కనిపాండితిమించి సర్వసం
ప్రీతిమెలంగి క్షీరపురిఁ బెద్దగఁ గ్రాలిన సుబ్బరాయ వి
ఖ్యాతుని కల్లసోమమయు నా నరసాంబయు లక్ష్మిదేవియున్
బూతలు సోదరీమణులు భూరియశః పరిపూర్ణ లెంతయున్.

సీ. "భూసురాన్వయ శుక్తి ముక్తాఫలంబు నా
జనియించి యామ్నాయసమితి నెల్ల
సాంగార్థముగ దాము చదివి శిష్యాళికి
నధ్యాపనముచేసి రార్యసభల
కటుకంబున నొక్కకణమైన యర్థుల
కిడనిచో దివ్యాన్నమిడిరి వీరు
వేంకటరామాఖ్య వెలసె నెవ్వరుధాత్రి
వితరణమ్మున కర్ణు వెరగుపరచి

గీ ఆయనకు సుబ్బరాయాఖ్యు డవతరించె
జీర్ణదేవళముల బాగుచేయుటలును
పేదలకు వివాహములు గావించుటలును
పెరకు సాయపడుటలును వీరివేడ్క."

శా. ఆవంశక సుకవీంద్రులెందరో తదీయంబౌ చరిత్రంబు సం
భావింపన్ గనియున్ నిగర్వియగు సుబ్బారాయ ధీశాలి సీ
తావామాంగిని సాధ్విగాఁగొని సుపుత్రిశ్రేష్టులన్ ముగ్గురన్
దావాప్తి త్రయమట్లుకాంచి ఘనమోదంమెప్పఁగా వర్ధిలెన్

శా. శ్రౌతస్మార్తములందు వైద్యమున చంచద్ధర్మశాస్త్రంబునన్
జ్యోతిశ్శాస్త్రమునందు బ్రజ్ఞ గడు విజ్ఞుల్ మెచ్చఁగాఁబొంది వి
ఖ్యాతిన్ గాంచెను రామలింగ లసదాఖ్యన్ జ్యేష్ఠుడాముగ్గురన్
జేతోమోదముఁగాఁగ జేకొనితమిన్ శ్రీసుబ్బమాంబాసతిన్.

ఉ. కోరితనంతనే నడచి కూరిమిఁ జావపయిన్ బరుండి వే
నూరికిఁబోయివచ్చు నొక యోధునిమాదిరి బంధుమిత్రులన్
జీరి యొకక్కరిన్ గని ప్రసిద్ధములౌ హితముల్ వచించి యే
వారును బలత్కరించకుడు వంతను చెందకుడంచుఁబల్కి సు
స్ఫారమనంబుతో నుపనిషత్ప్రవంబొనరించి ప్రాణముల్
ధీరతవీడు నీఘను సుధీమహిమోన్నతి ప్రస్తుతిన్ గనన్.

కం. ఆ ముగ్గురిలో గనిష్ఠుం
డా మాన్యుడు వేంకటరామయాఖ్యుఁడు వెలయున్
గామేశ్వరీ సతీయుతుఁ
డామోదకరాంతరంగుఁడతిధృతిఁ ఘనుడున్.

చం. నిజపురి కేబదామడను నిల్వగనైన మృతిపైకొనంగ న
క్కజముగ నప్రయత్నముగ గానగనౌ తన దత్తపుత్రుతోఁ
డఁజనుపుమీఱఁబల్కుచు హఠాద్వ్యాధి, శాంతముమీరఁ దారకో
గ్రజపముతో మృతింగను నఖండపవిత్రుఁడు తన్మహాత్ముడున్.

ఉ. స్ఫాయదమేయకీర్తియు నవార్యమనస్తదార్ఢ్యశోభితుం
డాయత లౌకికాగ్రణి నిరంతర తారకనామ చింతనా

మేయ మతిప్రభాసుఁడును మేదురవర్తనుఁడైన సూర్య
నారాయణమూర్తి మజ్జనకుఁడందున మధ్యముఁడుత్తమాత్ముఁడున్

చం. తలగడ ఎత్తు జాలడిట దాపుగనుండు మటంచుఁబిల్చి ని
శ్చలమతి నాయొడిన్ దలను జక్కఁగఁజేరిచి జ్యేష్ఠసోదరుం
డెలమిని వేదశీర్షములు నింకొకపర్కఁనుఁ దారకంబు నేఁ
బలుకుచునుండు సర్వహితబంధులుఁ జుట్టును జేరివిల్వ గుం
డెలపయిఁజేయివైచి కొని శీవిగ శాంతమనంబుతోఁడఁ బ్రో
జ్జ్వలగతిఁ దానుఁదారకముఁబల్కి యకుంఠితహాసవక్త్రుఁడై
యలఘువిధిన్ శరీరమును హాయిగ స్వీయగృహంబునందు వి
స్తులగతివీడు మజ్జనకుఁ దోరపుఁబుణ్యముఁ బ్రస్తుతించెదన్.

ఉ. న్యాయపథానువర్తిని యనంతమహీసురదేయనిస్తులా
మ్నాయచయుండపోనిధి ననారతవైదిక ధర్మశీల శా
రేయు సమస్తసద్గుణగరిష్ఠు విశిష్టుఁడుష్టు సూర్యనా
రాయణ దీక్షితాహ్వయు ధరామరవంశవరిష్ఠుఁ దండ్రిగన్.

ఉ. వేదనగంబుఁగాగ బృథివీతలమందు సమస్తదిక్కులం
దాదరగౌరవాదులు మహాత్ముఁడౌ శతకావధానియున్
మేదురకీర్తి యుక్తుఁడు నమేయామహోత్తమ ధర్మకార్యదీ
క్షాదళితాఘుజాలుఁడగు కామయయున్ బినతండ్రులయిరిగన్.

సీ. జ్యోతిష భైషజ్య సత్కవిత్వకళాప్తిఁ
గ్రాలెడి వేంకటరమణమూర్తి
అతులిత సాంస్కృతవ్యాకరణాది శా
స్త్రముల బోధించిన రామమూర్తి
అతులోపనిషదర్థతతిని హిందీఁ బ్రజ్ఞ
నలరారు సూర్యనారాయణుండు

ఆస్థానముల భూరియశమందుచున్న సం
గీతశాస్త్రజ్ఞుండు కృష్ణమూర్తి

గీ. భ్రాతలుఁగఁ గ్రాలఁ గాల్నాథభట్ల వంశ
దీపమైన కామేశ్వరీదేవి తనదు
సాధ్విఁగాఁగఁ జేకొనుచు మజ్జనకుఁడెలమి
సర్వవిధ సౌఖ్యజాలము లుర్విఁగనియె.

ఉ. ఈశ్వరభక్తినిఁ గడు నిజేశ్వరభక్తి నిమించి సౌమ్యగా
విశ్వనుతాఖిలార్యగుణపేటిగ మేటిగ సాటివారిలో
శాశ్వత కీర్తినిన్ గనిన సాధ్వికి నాజనయిత్రియైన కా
మేశ్వరినిన్ మదీయపిత మేదురభక్తిఁ దలంచి మ్రొక్కుదున్.

క. వినయము భక్తియు రక్తియు। బెనగొన బిట్టభినుతింతు విమలతరయశో
ధనులును విజ్ఞానఘనులు। ననగా ఘనవినుతిఁగన్నయట్టి పితరులన్.

---

## షష్ఠ్యంతములు.

కం. శ్రీకరునకు ముక్తిపద
శ్రీకరునకు భక్తజన వశీకరునకు మో
దాకరునకు జయకరునకు
శ్రీకాకుత్స్థాన్వయాబ్ధిశీతకరునికిన్

కం. ఖండిత చండారికధను
ర్గండునకుద్దండకీర్తి తతిపూర్ణ బ్ర
హ్మాండునకు కాండకాండో
చ్చండితరిపుషండునకు యశశ్శౌండునకున్.

కం. పృథుల రఘువంశదుగ్ధాం
బుధిపూర్ణ సుధాకరునకు మునివరకథి త
ప్రథిత చరితా ప్రకరునకు
బుధనుత కళ్యాణ సుగుణపూతవరునికిఁ.

కం. వనజోపమ నేత్రునకును
వనజభవాద్యఖిల దివిజవారవినుత పా
వన జీవన ఘనునకు యా
వన జాతకుగుణభుజంగ పక్షీంద్రునకున్.

కం. శ్రీరామునకు మునిమనోం
భోరుహ ధామునకు భుక్తిముక్తిప్రద సు
స్ఫారిత నామునకు, దనుజ
వారవిరామునకు భక్తవరకామునకుఁ

గీ. పాదనీరేజయుగ సమర్పణముగాఁగఁ
గడువినయ మొప్పనిపుడు బల్కంగనున్న
యట్టి నిశ్శ్రేయసానందమనెడి కావ్య
మునకు గల కథాక్రమ మెట్టిదనినఁ గ్రమత.

---

## కవిగారి ఇతరగ్రంథములు

1. భక్తితత్వసుధాలహరి
2. హితైషిని
3. విదుషి (పద్యములలో నవల)

వలయువారు:- ముత్యసుబ్బారాయుడుగారు, పాలకొల్లు
ప. గో. జిల్లా. అనివార్యియుడు,

# నిశ్శ్రేయసానందము.

## ప్రథమాశ్వాసము

కం॥ శ్రీమద్వాణీశ రమే
శోమేశ్వరరూపరక్షితోత్తమ విబుధ
స్తోమా సకలాపనిషద్ధామా!
రఘువంశసోమ! తాపసకామా! 1

కం॥ "శ్రీమంతంబగు భాస్వ
ద్ధీమత్సౌఖ్యము సమస్తదిగ్వ్యాప్తయశ
శ్శ్రీమంతము వైజ్ఞానిక
ధామంబును నగుచు భారతక్షితి యొప్పున్. 2

చ॥ కలుముల కొట్టపట్టు బుధకాండము చేరెడి రచ్చపట్టు శ్రీ
కలితుల చేనిపంట యధికారమదాంధుల కగ్గిమంట తొ
లలనకుఁ బూలదండ విమలశ్రితకోటికి పైడికొండయున్
ఖలతృణపాళికిన్ జ్వలనఖండము భారతఖండ మెంతయున్. 3

శా॥ కర్మప్రాభవమున్ వివేకము నశక్యంబైన యాత్మస్థితిన్
ధర్మాంతర్గతమర్మముల్ దెల్పి శాస్త్రస్తోమముల్ చేవమై
తీర్మానించి సమస్తదిక్తటములన్ దెల్పన్ గడున్ మించి యే
కర్మంబిప్పుడు హిందూదేశమిటు వెన్కన్ బట్టె నన్నింటిలోన్. 4

క॥ శ్రీనాథుఁ డూర్చ్చిసి చేకల
సూనుచు ధర్మం బధర్మ విహాయము యని చెన్ను
తెలియుఁ బలుకుచుఁ గొందరు
కానిపనులు సేతురేమి కర్మము జగతిన్! ౫

చ॥ అనవరతంబు మృత్యువశవర్తి శరీరమాయమనుచుఁ బొల్పు తే
లిను దనమేలు చెన్ను గొలుపుము రాము, ధనంబు దుఃఖభా
జనమనియున్ సతంబుఁ గాలియు బిల్వదహాంకృతిన్ ధనా
ర్జనమునకు దుర్జనీతులుగ నుంచుదు మెన్ని దిరేమి మాయయో! ౬

ఉ॥ వేషమునూని నాటకము వేయు నటుండు తదీయ వేషసం
తోషము చేత నైజపుఁదనున్ మఱపొందుచు నాట్యపోవణా
దూషణ మెంచు భంగిని తనుత్వము నొందిన తాను తన్నుఁ దే
హేషము రంగమున్ మనది జేలగనా నటజేయు మాయయో! 7

గీ॥ వాహనము నెక్కి త్రైవైభవముల మఱిగి
దిగవలయుచోటు మరచు నెవ్వరును బోలె
దేహమో కారణముగ గొన్న యుపాధిన
విషయముల మున్గి తనసత్యవిధము మఱచు! 8

చ॥ ఎటుకో వనంబులందు వసియించెడి కొందఱఁ గూర్చి కాని, కొం
కృటులనొక జాతిఁ గూర్చియు నొకానొక సంతతిఁ గూర్చి కాని యీ
స్ఫుటమగు వేదశీర్షమునబోధ జనించెనె, యెల్లవారునం
తటను సమస్తకర్మకులఁ దద్దయు గాంచగ గాని నిచ్చలున్! 9

క॥ లో వెలి చూపును నాత్మరమై
గా విమలవివేకము పొందఁ గనుఁగొని ప్రకటితం
బౌవిధిని స్వీయకర్మము
గావించు నసంగు లెనఁగఁగా భువి శివిగా! 10

ఉ॥ ఏది సమస్తసత్త్వహిత మిత్థజగత్ప్రతిపాలితంబు వే
దాదిముఖల్ వచింతురొ తదావనిషత్ప్రతిపాదితాంతికా
మోదపథంబు పీడికొని స్వాగ్రమనంబులఁ బోచు మార్గమే
యూది వచించుచున్న నదియుత్తమనామ పథమై ప్రపంచనా
భ్యోదయకారి కాఁగలదొకో మఱియుక్ పెతఁగూర్చుఁ గాని సం
శే దన జెందకుండవు సుమీ నిగమాంతవిచారశాస్త్రసం
పాదము లెందుసంస్కరణ పట్టనె కాని సనాతనప్రవా
ఖానులయందు గాని విధియంతటివాఁడు కడంగియుండినన్
గాదని యొక్కనేఁ గడుగాసిలి సంస్కరణం బ్రోకంతును
త్పాదన జేసి యున్నఁ బ్రతిభఁ బ్రకటించి సనాతనంపుస
ద్గ్రామ్నదుల నొందుపట్టి యడియూసఁ బ్రచారము సల్పినన్ మహా
ఖేదమె యొట్టకుంగలుగఁ గేవల సూత్న విధానయత్నమం
దేదిగ జేయు; మాదిరుల నేటికి జెల్పఁగ! నెన్నియెన్నిధ
ర్మాదులు చూచుచుండఁగ రయంబుగ మారుచునుంట లేమ! శ్రీ
భేద మతప్రతాది బహుభేదము లన్నియు వేదశీర్షసం
చోదిత ముఖ్యసూత్రము లసూయలచే విడనాడి స్వేచ్ఛమై
సోదనుఁబం నొకానొక రసప్రభమునంబుల స్వాస్థ్యకాంక్షచే

ఖేదలవుల్ జనించు నెడపోకడ లన్నియుఁ బోయి చాతురీ
వైదికశాస్త్రజాలముల వానిసమర్థనఁ జేయఁజూచుచున్
ఖోదులమం చహంకృతుల శూన్యవివాదములందు మున్గుచున్
భేదమె వృద్ధిచేసికొని బిట్టుగ జెట్టలఁ బట్టఁ జేయుటన్
గాదె జనించుచుండెను! నఖండబలంబుల నార్యధర్మముల్
మేదిని నుద్ధరింపు! డికమేయఫలమ్ములుగల్గు శాంతిసం
పాదన కింతకంటెను నుపాయము లేదు ధరిత్రి నీరులో
సోదరులందు భూరిసుగుణోన్నతులందు మతప్రచారకా
హ్లాదమనస్కులందు సముదంచిత సంస్కరణాభిలాషలం
దాదరమొంది యీవిషయ మాత్మల నిల్చెడినేని భూరిస
మ్మోదకమె యెల్లెడం గలిగి పూతతరంబగు దేశమన్నిటన్!”

శా॥ ఈరీతింగడుఁ గర్ణపేయముగ నెంతే సూక్తిరావంబు లే
తేరం దత్స్వరమంగనాస్వనముగాఁ దీర్మానమున్ జేసి శాం
తారంబం దబలాస్వనం బెటులు సంప్రశ్నించె నం దంచితుం
డా రాజన్యవతంసు డచ్చెరువుతో నావంక వీక్షించుచున్!

గీ॥ బహువిధలతాంతసౌరభవంత మగుచు
జల్లనగు పిల్లతెమ్మెర మెల్లవీవ
సత్వగుణశోభితానేక సత్వతతుల
గనుచు నావైపు నడచె నమ్మనుజవిభుఁడు!

మ॥ వనముఁ దాళతమాలసాలకదళీపాలాశపున్నాగచం
దనచూతాదిమహీజభాజనము బ్రోద్యన్నామసిద్ధాదిస
జ్జనవాక్సారవిహారపావనము చంచత్పల్లవాహారసం
జనితానందవిహంగజీవనము భూజానేంద్రుఁ డీక్షించుచున్ ॥ 20

సీ॥ చిత్రమణులు లేక చిత్రకారులు లేక
నిజరమ్యత నెసంగు నెమలిగములు
జ్ఞానచింతన లేక ధ్యానవాసన లేక
యానందమునఁ జెందు హరిణగణము
ఏధనంబును లేక యే జనంబులు లేక
యుత్సాహమొందు ఖగోత్కరంబు
పరివారములు లేక పరిహారములు లేక
యారోగ్యసంపూర్ణమగు తలములు

గీ॥ పరగు నుపవనముఁ గనె నృపవరుఁ డచట
సహజనిర్మలానందపు సరుకుకొట్టు
ప్రకృతిరమణీయుతలకును రచ్చపట్టు
నలఘుతరతపోమంత్రాళి కాటపట్టు ॥ 21

శా॥ ధీరస్వాంతుని నైన నొక్క త్రుటిలో దీనాత్మునిన్ జేయు నా
కూరవ్యాఘ్రమృగేంద్రసంకులమహాఘోరాటవీమధ్యమం
దారాజన్యుఁడు కాంచె మోదమున శాంత్యానందవిజ్ఞానసు
స్ఫారప్రాభవశోభితోపవనమున్ జంచత్తపస్థానమున్ ॥ 22

కం॥ చాటున మాటలు వినఁబడు
చోటటకు సమీపమంచె చొప్పడి యున్నన్
దీటగు బాటలు లేమి ని
రాటంకపు చెట్టు దారి నాతఁడు చనియెన్ ॥ 23

శా॥ ఆనీతాఖిలపుష్పగంధపరితుష్టానేకచేతంబు సు
స్థానోద్భూత నదీవినిర్మలజలస్నానప్రపూతం బమం
దానల్పోర్మిమహాశిప్రభాతఘనసమాంద్యస్ఫీతముల్ శీతముల్
ప్రాణిశ్రేణిమనోహరంబు నగుసద్వాతంబు తఁ బిల్వఁగన్ 24

గీ॥ సరసకిసలయసత్ఫలాస్వాదనమ్ము
దితవివిధపక్షిసంతానరుతము వినుచు
నతులితానంద జనకదృశ్యములఁ గనుచు
మెల్లమెల్లగ నరిగె భూమీధవుండు. 25

కం॥ కుడిభుజ మదరుటయును న
వ్వడుపున నదురుట నెసంగు భాగ్యఫలం బ
య్యడవిని నెటుకల్గునో యని
కడునాలోచించు చరిగె గాలి తెరలలోఁ 26

మ॥ వలనొప్పన్ బుధచంద్రులయ్యినుడు సద్వారంబు సంచారముల్
సలుపన్ సద్ద్విజగానరాజి సుమనస్సౌఖ్యంబు నభ్రాభమున్
ఫలసంధాయకభూజపంక్తియుచు భవ్యశ్రీమరుద్వాహినుల్
వెలయన్ విష్ణుపదంబు ముట్టి వనమొప్పెన్ మోదపూర్ణంబునై. 27

గీ॥ సుమశరమ్ముల గురియించి సుందరమగు
శోభలం మీరి యామ్రప్రసూనవమని
యంగభవతాపహారక మైన దగుచు
రామమై యొప్పె నవ్వనసీమ మిగుల 28

సీ॥ ఫలభారనమ్రమై వరుస నిల్చుకుజాళి
వినత భటావళి ననుకరింప
నవని రాలిన పూప్రలాసములఁ లలిమీరి
వరుసదీర్చిన రంగవల్లు లనఁగ

సల్లిబిల్లిగఁ బెల్లు నల్లు పల్లవపాళి
చలువపందిరి లీల వెలయుచుండ
నందందు రాలు రమ్య కుసుమగుచ్ఛాళి
సన్మాన సన్నాహ సరణిఁ దోప
ద్విజరుతముమంగళధ్వని వీకదనర
గంధవాహుఁడు ముందుమార్గంబుఁజూప
నడువఁ దొడగెను పుడమిఱేఁ డడవి నడుమఁ
గందుటలు ప్రమంద డెంద మానంద మొంద. 29

కం॥ ఆలోనఁ గుజమునీడల
నాలోకించెను నృపాలుఁ డతిరుచిరతనూ
లీలం స్వజనకసేవా
శీలం ధృతమాలవిమలచేలం బాలన్ 30

కం॥ స్వర్ణమయభూష లేకయు
పర్ణసుమాదులనె తాల్చి భాసిల్లెడు సం
పూర్ణరుచిరయగు నవ్వర
వర్ణినిఁ గని భూమిజాని స్వాంతమునందున్. 31

శా॥ జంబాలోత్పలకంబుబింబమహిభృజ్జంబూరుహశ్రీజాంబుకం
జంబుల్ యానకదుర్గిళోష్టకుచకేశస్తోమవాగ్దేహవ
క్త్రింబుల్ కన్గొని యొండి వాడి చెడి కృత్తంబై జడంబై యప
ధ్యంబై నీచగమై యగంధమయి ప్రయ్యాల్ వారెఁ దత్సన్నిధిన్ 32

ఉ॥ తమ్ములనేలు కన్నులు సుధాకరునేలు మొగంబుఁ దేంట్ల మొ
త్తమ్ముల నేలనౌ కురులు దాడిమగింజల నేలు పండ్లు న
భ్రమ్మును నేలు కౌను రుచిరమ్మగు నంగకముల్ కడానిమే
నిమ్మగుకుల్కు గుబ్బలహా! యింతటి రమ్యతఁ గంటినేమొటన్! 33

కం॥ అని యిటు లనేకరీతుల
సనుపను రమణీయగాత్రి యందము నెంతే
మనమునఁ దలపోసికొనుచుఁ
దన యెదుటికి జటిగె నతఁడు తద్దయుఁ బ్రీతిన్ ॥ 34

ఆ॥ నభమునందుఁ గల సహస్రాంశువము పోంత
మెలఁగు మెఱుపు కరణి మెఱయుదాని
నంగకృతవిభూతియా తజ్జనకు మ్రోలఁ
దనరు కనకగాత్రిఁ గనియె నతఁడు ॥ 35

మ॥ పరిభుచంద్రింపు సమీపమందె కమనాత్రిం బుష్పతిల్లంగఁ బూ
ర్వభవోపార్జితభూరిపుణ్యఫలసర్వస్వంబు నానన్యదు
ర్లభసౌందర్యవిభాసితాంగి యగు తద్రాజాస్య నీక్షించి ప
ద్మభవుం జేరికి మీఁదుగట్టెనొకదా తత్కన్య! నెంచెంచుచున్. 36

ఉ॥ చిత్రితరూపమో యజుఁడుచేవబయల్పడద్రిష్టసద్వని
చైత్రిముగాసృజించిన పసందగుసుందరమూర్తియో యనం
బాత్రితఁగన్న నవ్యసుకుమారశరీరనుగాంచి యీలతా
గాత్రియొపో వివేకసుధ గాననునించెనటంచు నెంచుచున్. 37

కం॥ మునుసలిఁ గదియఁగ జనున
య్యావనున ననుపమలతాంగి యవనతముఖియై
యొదిగె నొకకుజము వెనుకకు
బెదరుచున్నట్టి తళుకుబెళుకుం గనులన్. 38

ఆ॥ కదిసి నృపతి భక్తిఁ గదుర నమస్కృతిఁ
జేసి గౌరవంబుఁ జెంది వృద్ధు
డచట జూపినట్టి యాసనంబునుఁ జేరి
యొఱుఁగ జేసి తన్ను నిట్టులనియె. 39

మ॥ "భుజపీఠస్థితకార్ముకాంకములు సంపూర్ణాస్యవర్చస్సుగాం
చ జనేశాన్వయములం జుఁ దోఁచెడిని, చంచద్వేషభాషామలిన్
సుజనస్తుత్యతపస్వివంశ్యులని తోఁచున్, మీర లెవ్వార లిం
దుఁ జరింపం గత మేమి యొంటిమెయి సంతోషంబునన్ దెల్పరే! 40

ఉ॥ రూపము విద్య శీలము నిరూఢిగఁ బోఁతనుబోసి యయ్యజుం
డేపుచు గౌశలంబు వెలయింప సృజించె ననంగ నొప్పుచున్
రూపుదుఁబట్టి కన్యగ నిరూపణఁ జేయఁగ వచ్చు నీలస
ద్రూపిణి యేమికావలె నెఱుంగఁగఁ జేయరె మాకు నెమ్మితోన్".

కం॥ అని ప్రశ్నింపఁగ నాతఁడు
మునుఁ గాశ్మీరపతియాట మొదలు తపోవాం
ఛను సఫలఁజేయు టాదిగఁ
దనచరితముఁ దెల్పి పిదపఁ దరుణి విషయమై। 42

శా॥ "ఐదారేఁడుల ప్రాయమప్పు డిట నియ్యబ్జాక్షి మాతల్లిచే
నీదుర్గాంతవనానఁ ద్రోయఁబడి సుంతే స్వీయజన్మస్థలం
బా దేశంబగు కోశలన్ జనఁగ నూహింజేయ దా రాజభో
గాదుల్ గోరదు నాఁటఁగోలె సుతచాయన్ నిల్చె నాచెంగటన్. 43

కం॥ గానముల ప్రోడైన రూప
మ్మునఁ జరితను నమలమైన పుణ్యవతిని నీ
వెనుఁ బ్రేమఁ బిలిచి కొనుచుం
టిని నేను ధరాధినాథ! నిశ్శ్రేయసగన్. 44

శా॥ మాద్యద్దంతి సమానగామినికి నీమాన్యాంగలావణ్యస
ద్విద్యాశీలగుణస్వరూపఖని కేధీరాత్మునిన్ గూర్చినన్
మద్యత్నంబు ఫలంప గల్గునని సంభావించి యొక్కొక్కటన్
మద్యోగాభ్యసనంబు గూడ మరతున్ సత్యంబు, రాజోత్తమా! 45

శా॥ ఆలోకింపఁ ద్వదీయలక్షణము లీవాపెన్ మదిన్ గోరునా
శీలన్ గోచరమయ్యె నీముఖకళన్ వీక్షింప నౌదార్యస
చ్ఛ్లాఘ్యంబవటంచుఁ దోఁచు, నయినన్ క్షేమంబుగా దిట్టులీ
బాలన్ నిర్ధనరాజ్యహీనఁ గొనుటన్ భావింప నీబోంట్లకున్. 46

కం॥ కయ్యం బాడెడు వేళను
వియ్యంబును బొందఁ జూచు వేళను మిగులన్
నెయ్యము సలుపఁగ బోయెడు
నయ్యెడనున సములె వలయు ననుటను వినవే!" 47

కం॥ అని యోగి పలుకుచుండఁగఁ
గని ఘనవేణియును చాటుగా నిల్చియె యా
మనుజవరుఁ గన్నుఁ గొనలనె
కనుఁగొనె తనగుట్టు బయలుగాఁ గుతుకమునన్. 48

మ॥ తొలిదృష్టిన్ బరిభవించియున్ బెనఁగి యుద్బుద్ధంబు నుద్రిక్తమై
తెలివిం బొల్చి త్రపం దరిఁగియున్ దేటెక్కు ప్రేమంబుతో
మిళితంబైన కటాక్షవీక్షణము నెమ్మిన్ మేకనీ కాంతుపైఁ
గలువల్ దండగనై కడింది యతనిన్ గైసేసె నొక్కుమ్మడిన్. 49

కం॥ ఆమాత్ర మంత్రితుంబలె
నే మాత్రాకాల మామహీపతి జడుఁడై
నైమఱచి తేరి తదుపరిఁ
దామానసమందు నిట్లు తలపోసెఁ గమ్మన్. 50

శా॥ నానారాజకుమారికామణుల విన్నాణంబు వీక్షించు నాఁ
డేనాఁడున్ జలియింపకున్న దిటవో యీ నామనంబిట్లు నేఁ
డీ నారీమణిపైని వ్రాలి మఱిసుంతే వీడి రాదేల! క
ర్మానీతంబిది గాఁగ నోపు!" నని యూహం జేయుచున్ ముగ్ధుడై.

చం॥ సుమశరసంప్రచారముల చొప్పులు సుంత యెఱుంగకుండ జ
న్మము మొదలిగ్గ నన్యహరిణప్రియపోతములందుఁ గూడి త
త్సమముగ వృద్ధిఁగనెను సారసలోచన యయ్యు నద్వితీ
యమృదువచోవిలాసముల నందఱిమించెను నీమె వింతగన్. 52

కం॥ క్షణమాగి యోగివరు నీ
క్షణమాత్రము చేత నెఱిఁగి సకలవిమల ల
క్షణమాన్యకన్యకం జే
క్షణ మానసమునఁ గోరి సవినయరీతిన్. 53

ఉ। "ఆంతర దృష్టి సర్వవిషయమ్ము లెఱుంగఁగఁ జాలు మీరలి
ట్లింతగదీనిఁ గూర్చి వచియించు తెఱంగును గాంచ నన్న న
త్యంతము హెచ్చరింప నిటులంటిరొ, కాక పరీక్ష సేయఁగా
స్వాంతమునం దలంచిరొ యటంచు నెతోఁచుఁ దపోధనాగ్రణీ!

చ। అని వచియించులోన సచివాదులు రాజెటకేగెనో యటం
చు నటవి యెల్లెడన్ వెదకుచున్ బొదమాటుననుండి యమ్మహీ
పుని స్వనమాలకించి వెలిపుచ్చినవున్నయంబుఁ దోఁప నా
తని దరికేగుదెంచి విహితంబగు రీతిని మ్రొక్కి నిల్చినన్. 55

కం। ఒడయఁడు నుడివిన నుడువులఁ
బడతుకయెడఁదయుఁ గడిఁది వడిఁబొడఁగని య
వ్వాడువున నుడువఁగఁ దొడఁగెను
బ్రొడమిన తమి వెడలిపడఁగ ముని కనుమతుఁడై. 56

మ। "అనయంబున్ నినుఁగూర్చి యీపరిసరంబం దెంతయున్ గొప్పగా
వినియుం ద్వద్వదనాంచితప్రబలగంభీరప్రభావాదులన్
గనియున్ స్నేహవిధిప్రకారముగఁ బల్కంగోరియో యిట్టులే
ననియుంటిన్ గొనబోకుమిద్ది యితరంబౌ జాడ డెందంబునన్". 57

చం॥ అని నుతియించి చూని వికచాంబుజలోచనఁగాంచి యాపె నె
మ్మనమును లక్షణాదులు సమానముగా గ్రహియించి మించు వే
డ్కను గనె దూరమందు నచట౯ దరియ౯ వెరపొందు కోయకొ
న్న నవిరిఁబోడుల౯ విమలనాకసతీసమసుందరాంగుల౯. 58

చం॥ కనుఁడీదె కాంచె మీనసఖ యఖండపురాకృతపుణ్యసత్ఫలం
బనియవ నా మనోహరు ననన్యసమాను నృపాలమూర్తి, నీ
తని కిల నీమె యీమెకు నితండును నన్నిట నుద్దిమై కడు౯
వనరుహజన్మసంఘటన పాటవమున్ వెయినోళ్ళఁ జాటరే! 59

ఉ॥ కీర్తిత వర్తనం బలరు గీష్పతితుల్య మతి ప్రభావుఁడై
వర్తిలి యార్తిహర్తయును భర్తయు నాచు విదేహకంచిత
స్ఫూర్తిని రత్నకూటపురి ముఖ్యపురమ్మయి ప్రాల నెంతయు౯
గీర్తి వెసంగుచుం చు నలు క్రేవల నేవినియుంటి నీతని౯. 60

చం॥ నగరములందు నెంతయు ఘనమ్మలరి విజ్ఞులు పల్కఁ జెన్ను నా
రఁ గలిగె రత్నకూటనగరమ్ము కరమ్ముఁ బురమ్ములందు నె
న్న గఁ దగినట్టి భూరిసుగుణాలఁ బరస్పర మున్నతిప్రదం
బగు పథమందు వర్తిలగలట్టి సతీపతిపుత్రపాళితో౯. 61

ఉ॥ ఆపుర మేలురాజు తనహైమకరావళిచేఁ బ్రజాసుఖ
ప్రాపకచాట రాజెయగు వైభవధాముఁడు నాట రాజెయా
నేపునమష్టవృత్తులలయించిభరించుచునుండి రాజెయా
ప్రాపయి రక్షఁజేయుచును రాజెయన౯ వినియుంటి నీతని౯. 62

శా॥ నానారీతుల సర్వముఖ్యవిషయాంతర్వర్తి యయ్యు౯ రవం
తేనెవ్వారలఁ పక్షపాతమును గ్రోధద్వేషాదుల్ లేని ని
త్యానందంబునఁ గ్రాలనేమొ జనులందానందనాముండు గా
భూనాథుండు ప్రసిద్ధిఁగాంచె విబుధుల్ పూర్ణంబుగా మెచ్చఁగ౯.

ఆ॥ సకలవిబుధవినుతసచ్చరిత్రుండును
నతులరూపవిభవుం డాఢ్యుఁడయ్యు
మదికినచ్చునట్టి మదిరాక్షి దొరకమి
బ్రహ్మచర్యమింతవఱకు విడఁడు. 64

ఉ॥ అందమునందు భావములయందుఁ బ్రవర్తనమందు సత్కులం
బందు గుణంబులందు సముదంచితవిద్యలయందు నెన్ని కో
రందగు కన్యకామణి ధరన్ గనరామిని నెందరెందఱో
సుందరమందగామినులఁ జూచియు బెండిలియాడఁ డింతకున్. 65

మ॥ మన నిశ్శ్రేయస భూరిసద్గుణవతిన్ మానిత్వమందున్ బ్రవ
ర్తనమందున్ సకలంబునన్ బతికిదద్దన్ దుల్యమై పొల్చి యీ
ఘనదాంపత్యము ధారణీతలికిఁ జొక్కంబైన యాదర్శమై
తనరం గల్గుటఁ దోఁపఁజేయుఁ గనుఁడీ తత్త్వప్రభాశోభలన్". 66

కం॥ ఈరీతి మౌని పలుకఁగ
నారాజీవాక్షు లెల్ల రనిమిషలీలన్
వారిరువురిఁ గన దొడఁగిరి
తీరని తమకంబుతోడ దియ్యంబెసగన్. 67

తే॥ యోగివరుని సన్నయోవలు గ్రహియించి
నూత్నదంపతుల ననూన వివిధ
సూనమాలికాది శోభితులుగఁ జేసి
హర్షమంది రంతరంగములను. 68

చం॥ కడు జయరావముల్ సెలఁగఁగాఁ గరతాళములున్ మృదాన నె
క్కుడు చెలరేగ యోగి మదకుంజరయానకరమ్ము రాజుచే
పిడి శుభసూక్తులం బలుక నిర్వురు మ్రాలలదీసి మార్చుకోఁ
గడఁగిరి సూనవర్షము లఖండముగాఁ గురియింపఁగా సఖుల్. 69

మ॥ అటనయ్యాటవికుల్ కనంబఱచు ప్రేమానందభక్త్యాళి ము
చ్చటఁ గైసేతయు నుత్సవప్రతతి నెంచ౯ శక్యమే! యెల్లరున్
దుర్నిరీక్ష్యము గూర్చిఁ పెండ్లిమహిపాదుల్ మెచ్చఁగాఁజేసి ర
చ్చటి యావింతల వైభవాదులకు హర్షంబంద వారెల్లరు౯. 70

పరిత్యక్త రచల జిహ్వా నిరోష్ఠ్యము.

ఉ॥ నీరజజాది నిస్తులిత నిర్జర రాజి సునిశ్చితస్థితి౯
సారధృతిన్ నుతింగొను ననంతరసోత్తర! సత్తనూజితో
నీరద! ధీరశీర్షధృతనిస్తులశాసన! దోషశోషణా!
సారచరిత్ర! ధైర్యజితసానుధరా! ధరణీసుతాసఖా! 71

స్రగ్విణి

జానకీహృత్సరోజాతఖద్యోతనా!
మానితోదారసన్మాని యోగీంద్ర వి
జ్ఞానిబృందారకాకాంక్షితాంచద్గుణా
దీనభక్తావనాధీనచిత్తాంబుజా! 72

స్వాగత. స్ఫారధీరనుతసద్గుణసీమా!
వీరదైత్యకులభీకరనామా!
వారిజాప్తకులవారిధిసోమా!
సూరివంద్యగుణసుందరరామా!

గద్య :—

ఇతి శ్రీరామానుకంపాకటాక్ష లబ్ధ కవితాధౌరేయ కౌండిన్యగోత్ర
పవిత్ర ముత్యవంశపయఃపారావార రాకాసుధానిల
య కామేశ్వరాంబా సూర్యనారాయణార్య
తనయ విబుధవిధేయ శ్రీసుబ్బారాయ
ప్రణీతంబైన నిర్యాణసానంద
కావ్యమందలి ప్రథమాశ్వాసము.

సమాప్తము.

శ్రీ

# నిశ్శ్రేయసానందము

-: ద్వితీయాశ్వాసము :-

క॥ శ్రీకంఠ ధనుర్భంగ
ప్రాకటలీలావిశేషరంజిత సీతా
స్తోకప్రేమకటాక్ష బ
హూకృతకల్యాణరామ! యోగిస్తోమా!

శా॥ శ్రీకంఠ ప్రదరాసనార్దనలసత్ క్రీడోల్లసత్స్వాంతసీ
తాకాంతామణి ప్రేమవీక్షణములన్ ధర్మాత్మతా మాను ల
స్తోకప్రేమ నొసంగు నక్షతల సంశోభిల్లి సంతుష్టుఁడౌ
నాకల్యాణరఘూద్వహుండు మిము నిత్యం బ్రోచుగాతఁగృపన్"

క॥ ఇటు పరిపరివిధముల బ్రి
స్ఫుటముగ నాశీర్వదించి భూమీపతి నా
దటఁ గని యిట్లు పలికెను ముని
పటుబుద్ధివిశేషవైభవ మ్మెసలారన్.

క॥ "ఈ వెఱుఁగని యర్థంబులు
భూవలయములోన నుండఁబో వయినను నా
భావమునకుఁ దుష్టికలుగఁ
గా వక్కాణింతు విను మకల్మషచరితా!

చం॥ కడుపసిబిడ్డయీవు మొ, యవ్వుఁ గాదన నేర్వదు పట్టణంపుసం
దడులకుఁ గ్రొత్త, మాయికమనఃపరిశీలనమన్ననున్న, నీ
సడిగని వర్తిలంగలుగు శక్తియు నున్నటులోఁప దేను నీ
యెడఁదవిశాలతంగని వహించితి ధైర్యము నుంత వంపఁగన్.

మ॥ సకలంబౌ నిగమాంతశాస్త్రరహస్యంబుల్ గడున్ బూర్వజ
న్మకృతంబౌ ఘనపుణ్యహేతువున సంపాదింపఁగాఁగల్గె నీ
యకలంకాత్మ, ప్రవర్తనంబునను దానారీతినే గ్రాలు నం
టకు శంకంగొనిఁ గాని పిన్నవయసౌటన్ సుంతయోచించెదన్.

ఆ.వె॥ తల్లిదండ్రిలేని తలిరాకుబోఁడిని
నగరమెఱుగనట్టి నాతి మిన్న
నిన్నినాళ్లు పెంచి యిప్పుడు నీచేతఁ
బెట్టుచుంటి నెట్లు పేర్మిఁగనవో!

కం॥ తనతలిఁదండ్రుల వీడుచు
ఘనసోదరబాంధవపరికరమువిడుచుచున్.
దనమనసఖులవీడుచు సతి
దనపతినిఁ జేరు టొక్క- దాస్యమునకొకో!

కం॥ కోమలశరీర లౌటను
గోమలత కార్యరచనకున్ గోమలలున్
భీమంబగు కార్యంబుల
క్షేమంబిడఁ బూరుషులును జెలఁగుదురు కదా!

సీ॥ స్త్రీయధర్మంబులనుఁ బూర్తి చేయుపట్ల
నొకరొకరిమించి జగతికి నుపకరించి
యిలను నానందనిలయమై వెలయఁజేయు
మిథునమేసుమ్ము గణనీయ మిథునమనఁగ.

గీ॥ ఒకరొకరిపైని యధికారమూనబోక
యేరిసద్ధర్మములయందు వారు దెలివిఁ
జెలఁగుచుండుటె స్వాతంత్ర్యసిద్ధి సుమ్ము
అదియె లోకాభ్యుదయ హేతువైన విధము.

కం॥ సతి పతియందును దత్పతి
సతియందును సర్వమయుని జక్కన గనుచున్
ధృతిమెయిఁ బరస్పరసహా
యత నాత్మవివేక మొప్ప హర్షింపఁ దగున్.

కం॥ తనసతి తనయెడ నెటు మనఁ
దనకింపగు నటులె తానుఁ దప్పక యెపుడున్
దనసతి యెడలను నడువఁగఁ
గను నిర్మలుఁ డొకఁడె సూవె ఘనుఁ డననొప్పున్"

కం॥ వైవాహిక సంస్కారము
కేవల తాత్కాలికమగు క్రీడయయిన దే
హావసరపు సంబంధము
గా విమలవివేకి గనఁడు ఖలమతి తక్కన్.॥

మ॥ తమవౌ దేహమనః ప్రవృత్తులను నధ్యాత్మప్రవృత్త్యాళి ను
త్తమపుత్రాదుల భావిలోకవిమలత్వాభివాళిన్ బ్రపం
చమునం దన్నిట జోక్యమున్నదగు సంస్కారంబెయౌ పెండ్లి జో
క్యము సంఘంబునకున్ మతంబునకు లేదంటన్ నిజంబున్నదే!

మ॥ ఒకకుక్షింభరతాప్రయోజనము నే యూహించుచున్ భోజనా
దికముం గూర్చుట కామవాంఛలనె తృప్తింగోరి పెండ్లాడు టా
ర్థికలాభాప్తికె విద్యనేర్చుటయుఁ గీర్తిప్రాప్తివాంఛన్ బరో
పకృతిన్ జేయుట మూర్ఖకృత్యములుగాఁ బల్కంగ నాలింపవే!

చ॥ మహితసుఖాసుఖంబులు సమానముగా వహియింపఁ దోడుగా
విహితవిధుల్ పొనర్చి సుఖించులఁ దేలఁగ నుంచిజోడుగా
సహితభవాబ్ధి దాటఁ బ్లవమై తనరారు సతీమతల్లి నాన్
బహుసుఖసాధనంబయిన వట్టి యచేతనవస్తువే కనన్?

చ॥ గృహిణియనంగ భార్యయును గేవలమీవు గృహస్థుఁడౌటచే
గృహమునకీవె నాథుఁడవు కేవల మామె తదీయదాసి యం
చహితములౌ తలంపులను స్వాంతతలంబునఁ జేరనీక స
ద్విహితగతిన్ గనుంగొనుచుఁ బ్రేమనుగౌరవ మొందుచుండుమా.

చం॥ ఎవరిమతానవారు తమకే యితరుల్ కడులొంగి వర్తిలం
గవలె నటంచు నందులకుఁగా, నవమార్గము లెంచికొంచునుం
టవలనఁ గాదె కాఁపురమునన్ నరకంబటుతోఁచు నైజని
త్యవిమలసౌఖ్యవర్తనకు దవ్వయి, భూపతి వంశదీపకా!

ఆ.వె॥ సౌఖ్యనరకములకు సతియె కారణమౌట
జాడ తెరిగి సతిని వాడవలయు
సతికి సద్గతులు సమకూరకున్నచోఁ
బతికి దేశమునకు భద్రమున్నె?

కం॥ మణికంకణమున నాకం
కణమును మణిచేత నొప్పు కరణిని స్త్రీ
మణి నీచే నీకన్యా
మణిచే నీవును నమేయమాన్యత గనుఁడీ!

చం॥ పసనిలనోపుచున్ శిశులభర్తలనిల్పుచు దైహికంబు మా
నసికముఁ దాత్త్వికమ్మును ఘనమ్మగు శక్తులయందు స్వచ్ఛతన్
రసభరితమ్ము రంజనకరమ్ము రమాయుతమై కరమ్ము సం
తసమిడు గీము గోము నిడు నల్వగురీతినిఁ జెల్వఁ జేవలెన్.

క॥ సతిసాయమునన్ సమ్మతి
ధృతిమై పితృదేవమునిఋణముక్తిని గాం
చి తరించు నుపాయముగని
చతురతవర్ధిల్లి సుఖయశంబులఁగనుమా.

కం॥ అని యిటు లానరపతి పు
త్త్రినిఁ గూర్చి వచించి పూని, లీలగనా బా
లనుఁ గని పలుకఁగఁ దొడఁగెను
ఘనమృదుగంభీరరీతిఁ గౌతుకమెసఁగన్.

కం। ఖ్యాతుఁడు సుగుణాన్వితుఁడు
ధూతప్రాపంచకోగ్రదుర్మార్గగుణ
వ్రాతుఁడు ప్రతిభాతీతుఁడు
ప్రీతిమెయిఁ బలుకఁ దొడఁగెఁ బ్రియసుతఁ గనుచున్.

చం॥ గురుకులవాసమందెఱిఁగికొన్న మహత్తరతత్త్వమెల్ల భా
స్వరగతి సర్వసత్క్రియలఁ బాటిలఁ జేయ గృహస్థమార్గమే
యిరవగు నాశ్రయంబగుట నీవు తదగ్నిపరీక్షయందుఁ జె
చ్చెర జయశీలవై యశముఁ జేకొనుమమ్మ, కుమారికామణీ!

చం. నరులును సందడుల్ గనని నట్టడవిన్ బ్రబలాగమాంత వా
క్సరణి మెలంగునీవు జనసంఘములందు సమస్తవైభవా
భిరతులయందు నెట్టులు గభీర సునిశ్చలితానుభూతిమైఁ
బరఁగెదవో కనన్ మహితవైభవమబ్బెనటంచు నెంచుమా!

చం. ఎవరు కలట్టిసర్వధన మీశ్వరభిక్షగ నెంచి యంటకెం
దు విమలులై మహాధృతిని దుఃఖసుఖంబులు లెక్కలేక తా
మవిరళరీతి నాత్మనిభులౌదురో వారె ప్రపంచజన్యదు
ష్టవికృతులందుఁ గూలక యశస్సుఖముల్ గనుచుందురెప్పుడున్

చం. ఎఱుఁగుదురెల్లవారు పరులెవ్వరికేనియుఁ జెప్పుపట్ల గ్రం
థరచనలందు నీతి, తమదైనికజీవనమందు నీతి మా
ర్గరతిని వర్తిలంగను నఖండవివేకగుణాఢ్యుఁ డొక్కఁడే
ధరఁ స్తవనీయుఁడౌ బుధుఁడు దానిమతిన్ విడఁబోకు మెప్పుడున్.

చం. పతిహితకార్యవర్తనలపట్లను దాసిని, యోచనాదులన్
హితసచివున్, సురూపమున నిందిర, నోర్పునఁ బృథ్వి, విందులం
దుఁ గులితమాత, హాసశయనాదుల రంభనుఁ బోలి నాథు సం
తతసుఖవార్ధిఁ దేల్చి సుమతంగను మెల్లవు డిందు నందునన్

చం. సకలకళావిశేషములఁ జక్కనివిద్యల భేషజంబులం
బ్రకటితలీల నేర్చి గృహరాజ్యము నెల్ల స్వతంత్రవృత్తిఁ గొం
కక నడుపంగలట్టి యధికప్రతిభాదుల నొందె సాధ్వి భ
ర్తకు శిశుపాళికిం బహువిధంబుల దాసటగా వలెం గదా!

శా. పతియం దీశ్వరభక్తి పిన్నలయెడన్ వాత్సల్యశక్తిన్ భట
ప్రతతిన్ భూతదయాప్రసక్తి సమవర్త్యశ్రేణి రక్తిన్ గుమా
ర్గతతిన్ భూరివిరక్తి ముక్తిని గనంగాసక్తియున్ యుక్తియున్
సతతానందముఁ బండితాదరము నిచ్చల్ గల్గి వర్ధిల్లుమా!

మ॥ బలవిద్యాగుణశీలసంపదలచే భాసిల్లి కాంతామత
ల్లులు స్త్రీధర్మము నెందు నిల్పఁగలరో లోకంబు నందం దెసగా
వెలయున్ సౌఖ్యపరంపరల్ సతము భావిప్రభవోపేతరీ
తుల స్త్రీయార్యకపాళిఁ బెంచుపని యెందున్ వారియందుండుటచేన్.

చం। ధనము ఋణమ్ము దోషతతి దానము మానము గౌరవంబు నా
స్థను గృహలోపపాళి మతితాపము వృత్తిరహస్యముల్ సుమం
త్రనిచయముల్ బయల్పఱుపరాని యెఱింగి సతీపతుల్ సతం
బును వెలయన్ వలెన్ బరులపోడిమి నోర్చి సమున్నతస్థితిన్.

గీ॥ ఒకరి గౌరవోన్నతుల కింకొకరు భంగ
మాపహీలనీక ధర్మనిత్యతను బ్రబలి
తగుపరస్పరాభ్యుదయసాధనము లనఁగ
దంపతులు మన్న భువి స్వర్గతలము గాదె.

చం॥ పతి సెడెనంచుఁ దాను సెడి భర్త యలక్ష్యము సూపెనంచుఁ దా
నతుల విలక్షణంబుఁ గొని యాతఁడు విద్దెను మానఁ దాను మా
ని తలిరుఁబోఁడికంటె నతినీచత నాతఁడు వాని కంటె నీ
చత విరిబోఁడియున్ గొనుట సంఘము నోంచగరాదు దీనతన్.

కం॥ బహురీతుల నిటు లాముని
తుహినకరాననను గాంచి తోషమ్మునఁ బె
క్కు హితమ్ములఁ బల్కి సుతా
సహవాసినులదెసఁ గాంచి సరభసశీలన్.

కం॥ పరిచయముమాత్రనే మన
మెరియునువిడ మనకుఁ గన్న నెట్లుండునొకో
యరయఁగ సహవాసమునకు
సరియగు సంగంబులేదు జగతిం జూడన్.

కం॥ తనయావియోగభవయా
తన నెల్లను పొని బహువిధంబుల నిటు చిం
తనఁ జేయుచుండ నరపతి
తనపురమునఁ జేర యత్నతత్పరుఁ డగుటన్.

శా॥ ఆకాంతామణితోడ నాతని పురప్రాంతంబుఁ జేరంగ వా
రాకాంక్షన్ బతిమాలినన్ ముని యరణ్యంబందె నిల్వంగ
సాకల్యంబుగఁ గోర్కెఁ బూనుటను రాజన్యుండు తత్సేవకై
పేమూర్చెన్ గడుయోగ్యమైన భటరాజిన్ దద్వనాంతమ్మునన్.

చం॥ సకలజనంబులన్ దగిన చాయల ఱేఁడు బహూకరించి మా
నికి వినయంబుతోఁప నతినిం బొనరించి వధూసమేతుఁడై
పటికటజయధ్వనుల్ చెలఁగ వాహనమెక్కి చమూసమూహ మ
త్యకలుషభక్తి వెంటఁ జన నాత్మపురాభిముఖంబుగాఁ జనెన్.

మ॥ భువనానందముగాఁగ షోడశకళాపూర్ణేందుఁ డారోహిణీ
ధవళాక్షీమణినట్టు లాసెగొని భూదారుండు తేరెక్కుచుం
డ వియోగంబున కోర్వలేక మదిమండ్రాటంబునున్ బూని యా
యువతీలోకము యోగియున్ నిలచి రత్యుత్కంఠ నిశ్చేష్టలై.

మ॥ వనితాలోకముఁ దదృషిప్రవరుడున్ స్వాంతంబు పద్యాల్ గొనన్
గనుచున్ నిల్చిరి మంత్రముగ్ధులటు రంగప్రేక్షకుల్ వోలె నా
తనిఁ దత్స్యందనముం దదీయవితతధ్వానంబుఁ దద్ధూళిఁ ద
ద్ఘనచక్రాదికచిహ్నముల్ క్రమత నంతన్ వట్టియాకాశమున్.

కం॥ ఇరుదెసలనుండి వదలిన
యిరువునకే పొగనువిడచు చేగడి పొగబం
డ్లరహిని వెనుకకె దృష్టుల
మఱలించుచుఁ జనిరి రెండువైపుల వారల్.

కం॥ ప్రజలెల్ల సంతసింపగ
సుజనస్తుత భూపుఁ డరిగె సురుచిరకీలన్
నిజపట్టణాభిముఖుఁడై
ధ్వజములు బిట్టెగురుచు శుభవార్తలఁ జాటన్.

చం॥ భళిమనరాజవచ్చె ననువారు వియోగముదుస్సహంబుఁగా
మెలగితి మన్నవారలు నమేయగుణాన్వితుఁడైనలేమని
మ్ములగొనిఁనాఁడు మంచిదియె పో! యనియెంచి ముదంబురాశిపీ
చుటఁ గడుఁ దేలి నిర్మలత శోభిలువారును నైరి తత్పురిన్.

కం॥ తమయేలిక యొకతన్వినిఁ
దమిఁ బెండిలియాడి పురికి దాపైన యుదం
తము నెఱిఁగి జనులు తమతమ
తమకంబుల నుత్సవప్రతతిఁ బ్రకటింపన్

క॥ తత్సమయంబున వారల
యుత్సాహము ప్రేమభరము నుత్కంఠయు నా
యుత్సవములు గైసేతలు
తత్సంతోషమును దెల్ప ధాతకువశమే!

క॥ నవదంపతులను కనుగవ
నవలోకించిన జనంబు లయ్యెరువురి రూ
పవిలాసభూరిసంప
త్సువిశేషంబులను మిగులఁ జొక్కెడువారై.

ఉ॥ అన్నిటికన్న నిత్యమును నన్నిరవద్యపవిత్రవర్తనంబునం
దెన్నికగన్న సద్గుణము లెన్నియొ చూచుటచేత నామెఁగ
న్గొన్నజనంబు, రూపమునుగొన్నగుణంబులపుంజమంచు లే
మన్నుతిఁ జేసి బిట్టుమది మన్ననసేయనివారు లేరటన్.

ఉ॥ ఆమెయుఁగూడ డంబము నహంకృతియున్ గరువంబు నాదిగా
నేమియు దుర్గుణంబు లొకయింతయు లేక సమస్తజీవులం
బ్రేమను గౌరవించుచు ననేకవిధంబుల నెల్లవారిలో
గీమున వన్నెకెక్క మనెఁ గేవల ధార్మికమూర్తియో యనన్.

ఉ॥ పిన్నలఁ గన్నబిడ్డలుగఁ బెద్దలఁ దద్దయు దేవునట్లుగా
నెన్ను సతీలలామ యెపుడెంతయు మారని హర్షచిహ్నపుం
గన్నులలేమ సర్వజనగణ్యతనొందినరామ స్వప్నమం
దు న్నయరీతివీడని వధూమణి యామె యమేయ యెందులన్.

చం॥ ఘనచరితాఢ్య తా నచిరకాలములోననె యెల్లవారి మ
న్ననలనుఁ బొంది సర్వసుగుణంబుల ప్రోవగుచున్ నిజేసు నె
మ్మనమును జూఱఁగోఁగలిగి మంజులవాగ్విభవాభిరామయై
యనితరసాధ్యసద్యశము నందెఁ గడిందియు రాజ్యమంతటన్.

మ॥ పురమం దేయొకమూలనో యొకఁడు సంబోధించి నిశ్శ్రేయసా
తరుణీరత్నము జన్మవంశము జనిస్థానంబుఁ బ్రశ్నించినన్
వరరాజ్ఞీమణి సద్గుణప్రతతియున్ భవ్యస్వరూపంబు నె
ల్లర ముగ్ధాత్ములజేసి తద్విషయమెల్లన్ మర్వజేసెన్ గడున్.

మ॥ సకలైశ్వర్యములందియున్నను దదైశ్వర్యమ్మునన్మగ్ని స్వీ
యకథన్ విస్మృతినొంద కామె తన కామైశ్వర్యవారాశి కం
తకు సంబంధము గుర్తెఱుంగుటను దద్సంగాన సమ్మోహ మొం
దక యస్థాంబగురీతి వర్తిలి దిగంతఖ్యాతి గాంచెన్ గడున్.

చ॥ ఉరమున నర్ధదేహమున నూరువునందు ముఖమ్మునందు స్వీ
యరమణులన్ వహించిన యనంతరసోత్తరులా మహామహుల్
వరయుగమందు బిట్టుఁ గనుబట్టు పరస్పరమైత్రియున్ దమిన్
గరుణయు స్వేచ్ఛ మున్నగు గుణంబులఁ గన్గొని వింతనొందరే।

గీ॥ సంపదాదులసంగంబు చాలఁ గలిగి
స్వీయసత్వంబు విస్మృతిఁ జేయలేదు
సంపదాదుల సంగంబు సడలఁజేయ
సంపదలఁ దృణీకారంబు సలుపలేము.

మ॥ అనయం బన్నిటియందు మోదమునె యన్యోన్యంబు సేకూర్చుచున్
ఘనవిశ్వంబును బ్రేమదృష్టి సతమున్ గన్గొన్చు విశ్వంబుచే
తను బ్రేమంబునఁ గాంచఁగాఁబడుచు నేతద్దంపతుల్ రూపమం
దిన యానందరసమ్మొకో యనగ నుద్దీపించి రెంతేనియున్.

మ. కమనీయోత్తమ హాసశోభిత లసత్కంజాత వక్త్రంబుచే,
నమృతంబు న్నిరసించు స్వచ్ఛమృదుభవ్యప్రేమ వాక్యాళిచే,
నమలంబైన విశాలమానసముచే నాపద్మపత్రాయతా
క్షి మనోనాథుని మానసమ్మున కతిక్షిప్రమ్ము గా నెక్కెడిన్।

కం. రమణీయత ననుకూలత
నమలిన మానసమునందు నన్నిట సమమై
యమరిన సతి గల పురుషున
కమరేశత్వ మ్మికెట్టిహాయినిఁ గూర్చునన్॥

మ॥ బలవిద్యాధన రమ్యతాదుల సమత్వం బబ్బి పద్మాక్షులి
మ్ముల నెంతే ననుకూలయై పతికి నింపుఁగూర్చుచుఁ బోల్చి వా
రలకారోగ్యసుఖాయువుల్ విధికృపార్ద్రస్వాంతుఁడై కూర్పని
శ్చలతన్ వారలు కాలఁదన్నరె సురేశత్వం బలక్ష్యంబునన్॥

ఉ॥ ఆధరణీశుఁడున్ గృహమునం దిటుమోదమహాబ్ధిఁ దేలుచున్
బాధలఁబాపి స్వప్రజల భవ్యసుఖమ్ములఁ దేల్చుచున్ ప్రజా
నాథితుఁడయ్యె నన్నిటఁ గరమ్ము సమర్థతఁ గ్రాలి లేఁడు భూ
నాథుల యందుఁ దత్సముఁడనన్ యశమందె సమస్తదిక్కులన్॥

చం. అతిసుకుమార మారజనకా! జనకామద! కామదాహకా!
శితరి! శ్రితపాల! పాలితశచీహృదయేశ! దయేశ! యీశసం
స్తుతఘననామ! నామపరిశోషితసన్మునికాండ! కాండని
ర్జితరిపుధీర! ధీరగుణసింధువరా! వరజానకీవరా!

సుగంధి. భానువంశవారిధిక్షపాకరా! మనోహరా!
దానవేంద్రభూరిగర్వతాడనప్రభావరా!
మానిశేఖరస్తుతోత్తమప్రభావభాసురా!
జానకీసతీహృదంబుజాతదివ్యభాస్కరా!

మాలిని, అమలినమృదుహాసా! యర్క-కోటిప్రభాసా!
విమలకమలనేత్రా! విశ్రుతోద్యచ్చరిత్రా!
సుమతివినుతనామా! సూర్యవంశాబ్ధిసోమా!
**విమతతతివిరామా! విశ్వవిఖ్యాతశామా!**

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధారేయ కౌండిన్య
గోత్ర పవిత్ర ముత్యవంశ పయఃపారావార రాకా
సుధానిలయ కామేశ్వరాంబా సూర్యనారాయ
ణార్య తనయ విబుధవిధేయ
శ్రీసుబ్బారాయ ప్రణీతం
బైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి
ద్వితీయాశ్వాసము
సమాప్తము.



శ్రీ

# నిశ్శ్రేయసానందము

## -: తృతీయాశ్వాసము :-

కం. శ్రీ జానకీసతీహృ
ద్రాజా! రాజాధిరాజ రాజితతేజా!
తేజోమయ మునిదివిష
ద్భ్రాజా! భూజానిరాజిపూజిత రామా!

మ. ఋణమున్ వహ్నియు మేఘముల్ జినుఁగు నంతేఁ జిన్నదైతోల్త దా
రుణమా రీతిని వృద్ధియై పిదప మీఱుల్ గాదె కష్టాళిఁ జే
రణమున్ జేయుచు, నట్లె శంకతొలిఁ బ్రారంభించుచో స్వల్ప కా
రణమై పిమ్మట వృద్ధినంది వెతగూర్పంజాలు నెవ్వానికిన్.

చం. తరుణి కళిమూన పూర్ణహిమధామసమాస్యను బుత్రికామణిన్
గరము సురూపసంపదలఁ గంతు జయంతుల గేరు పుత్రు, భా
సురగతిఁ గాంచి వర్ధిలెడు చొప్పును గన్గొను భాగ్యమబ్బుటన్
పురజనులందు వర్ధిలెడు మోదము మేరను తెల్ప శక్యమే.

చం. కళిమమునఁ గొంతకాల మటుగాగ జనంబుల మోదమంతయున్
సమయగఁ జిత్రమొప్పఁగ విచారము నీసు,నగౌరవంబు ద్వే
షము జనియించి వృద్ధియయి సర్వజనంబుల జేరుచున్ సభా
ళి ముఖమునన్ బయల్పడి బలీయముగాఁ గననయ్యె నెల్లెడన్.

చం. ఎటజనియించి యుండెడినొ యెవ్వరెఱుంగఁగలేని యామె తా
నటు తమరాణియాటయుఁ దశాత్మజుఁడున్ దమరాజ్యమేల నుం
డుటయును మేలుగాదనెడి నూతనభావము లుప్పతిల్ల సం
కటపడి రెల్లరున్ గ్రమముగాఁ బురి చిన్నలు పెద్దలచ్చటన్

శా. ప్రేమంబూనిన యేని రాజు కడు సంప్రీతిన్ వివాహంబు నే
భామారత్నము నైనఁ జేసికొనుటల్ భావ్యంబగున్ గాని మా
సీమన్ బాలననేయ నుత్తమకులస్త్రీరత్న సంజాతుఁడౌ
ధీమంతుండె సమస్తుఁ డంచు మహితోద్రేకంబువాగొందుటన్.

గీ. గుజగుజలు మాని పైసభాగోష్ఠిఁ జేరి
న్యాయసమ్మతి ప్రకటన నధిగమించి
సాముదాయిక విజ్ఞప్తి సరణి మాని
క్రమత మంత్రిపుంగవుని నిర్బంధపఱుప.

ఉ. ఆ సచివాగ్రగణ్యుఁడు ధరాధిపుఁ జేరి నయంబునన్ నతిం
జేసి వచింప నూరకొననేరక గ్రక్కున నీరు గ్రక్కుచున్
వీసముదాప కెల్లెడను విస్తృతమైన సమస్తభావముల్
పూసలుగ్రుచ్చి నట్టులు నృపుండు వినన్ వచియించి యొప్పఁగన్.

గీ. సర్వవిధముల యత్నంబు సలిపికూడ
వారితీవ్రతఁ దాను మార్పంగలేమి
తెలిపి కలిగిన ముద్దుబిడ్డలను వదలు
నెడల నుంత శాంతించునం చెఱుకపఱుప.

మ. ఒడయం డద్ది సమస్తమున్ విని తదీయోద్వేగసర్వస్వము
న్నఁడు శ్రీధర్ గమనించి తాఁ బ్రజలపైఁ గోపంబునుం బూనక
స్పడఁతిం దత్కుల గౌరవంబు దనతేనన్ లాతులూహించు టె
ప్పుడశక్యంబగుటన్ దదీయవచనంబుల్ యుక్తమే యంచు దాన్.

చం. "తలకొని యామె జన్మము విధమ్ముగ గట్టులు పైకిఁ దేటని
చ్చలుఁ బొనరించు యత్నములు చక్కఁగ సాగెడిలోన నింత లిం
తలు గడునాపరాకపయి దార్కొను నివ్విధిఁ గాంచ సర్వరీ
తుల విధిచోదితంబనియె తోచును నాకది మార్పశక్యమే !

కం. కోసలదేశములో నీ
వా సంగతి బయలుసేయ నాంచకురత నెం
తేసలుపు ప్రబలయత్నము
లీసరికి ఫలించియున్న నిది కలుగునొకో!

చం. ఎటువిధి వ్రాయు నావిధిని నేగుచు నాపఁగరాని దానినే
పుట విధికార్యమై యెదుటఁ బొల్చెడు కార్యము జంకులేక యు
త్కటమతి స్వార్థబుద్ధి మమతల్ విడిచేయుటకాక నుంతమా
ర్చుటకును వేగిరించుటకు నాలికి శక్యమె? మంత్రిశేఖరా!"

కం. అని యిటు కొన్నిటి సంగతు
లను విశదముగాఁగ శైయిలాపతి యామం
త్రినిఁగాంచి పలికి పిమ్మట
మనమున యోచించి సుంతమాఱని ధృతితోన్.

కం. ఏతత్సమస్తముం దన
నాతికెఱింగింపఁ గోరి నరవరుఁడా భా
మాతిలకముగల సౌధము
నాతత ధృతిఁ జేరె సచివుఁ నటుపన్ గొనుచున్.

ఉ. "జంకఁడు చీరికిం గొనఁడు సంఘము వేగిరపాటు చెంద నీ
వంకననందు సుస్థిరతఁ బాయఁడు హాసయుతాస్యమందుఁ గో
పాంకము లేనిఁ దేఁడు విధియట్లు విధించె ననందు బాపురే!
శంకరుఁడైన నాతనికి సాటియె సుస్థిరమానసంబునన్.

గీ. భవ్యులను ఘనప్రేమైకభాజనులును
అమలులుఁ రసికందులును భారికాధికులును
నైన కన్నబిడ్డల వీడ నడుగు నపుడు
కందు చెందని ఘనుఁడెందుఁ గలుగునొక్కొ..!

గీ. స్వీయపట్టణ మనలంపు శిఖలఁ దగులఁ
గనుచు శాంతిమై నిలిచిన జనకుఁ డొకఁడు
పూర్వ ముండెనటంచుఁ జెప్పుదురు గాని
అట్టినిస్సంగు నేఁడిట నరయఁగంటి.

ఉ. మంచియొ చెడ్డయో జరుగ మాటికిమాటికి దానిఁ గూర్చి యే
యెంచుచుఁ గార్యముల్ విడుచుహీనుఁడొకండునొకింతయెంచినన్
బ్రాంచితకార్యరాజివిడువన్ జనకుండెడు ధీరుఁడొక్కఁ డా
క్రించుకయున్ బొసంగనటులే స్థిరుఁడౌ మహనీయుఁడొక్కఁడున్.

కం. ఈలీల సచివపుంగవు
డాలోచనఁసేయుచుండు నాలో నృపుఁ డా।
లోలాక్షి యెదుటఁ దెలిపెఁ బ్రి
జాలోకవుఁ గలకలమ్ము సకలముఁ గ్రమతన్॥

మ. తనప్రాణమ్ములకన్న మిన్నగ ననంతప్రేమమైఁ గాంచి పెం
చిన యాబిడ్డల నిచ్చివేయుమని ప్రశ్నింపంగ నాలేమ యి
ట్లనియెన్ మెల్లన మందహాసగతి వక్త్రాబ్జంబునన్ మూల్పు నొం
దని స్థైర్యంబునుఁ దెల్పఁగాఁ బతికి నుద్య[illegible] ప్రముక్తంబునన్॥

శా. “ఈమాత్రమ్మున కేల నాకడకు మీరేతెంచి వాక్రుచ్చుటల్
వామాలోకము భర్తృవాక్యసరణిన్ వర్తించుటే కాని వే
రేమైన న్వాదియించుటర్హమయి యున్నే భేదభావంబులం
దేమాత్రంబు సతీపతుల్ మనిన వారేకాత్మలం టొప్పునే?

మ. మనయీవైభవముల్ శరీరములు శుంభల్లీల సర్వప్రజా
ధనవృద్ధంబులు తత్ప్రయోజననియుక్తంబుల్ తదానంద వ
ర్ధనమాత్రప్రకటంబు లౌట నవి సొంతమ్మంచు నాత్మేచ్ఛఁ ద
ద్వినియోగమ్మునఁ గాక యన్యమగురీతిన్ జేయఁగా భావ్యమే॥

శా॥ ధృత్యుత్సాహబలాదులై యనిమొనన్ దీపింపగా జేయుటన్,
బ్రిత్యూహమ్ముల రాజ్యవృద్ధికరమా ప్రఖ్యాతకార్యావలిన్
బ్రత్యేకంబుగ నీవినుంగు లసువుల్ పాయంగఁ గాకిట్టి లీ
యత్యల్పంబగుప్రాయమందు విడుటన్ స్వాంతంబువంతంగొనున్.

మ. సకలంబౌ మనసంపదాదులును నేస శ్రేయుకారుణ్యదృ
ష్టికిఁబాత్రింబయినంతఁగల్గెడినొ తచ్ఛిన్మాతృనేర్పాటుచే,
నొకవేళన్ విడనైన నందుఁగల దేవోక్తొస్నిటిన్ నేఁడు, దా,
నికినై చింతనుబూను టర్హగతియానే ప్రాజ్ఞులెవ్వారికిన్! ॥

చం. అని ముదమార నిర్వురగు నర్భకులన్ బిలిపించి ప్రేమమై
ననుపమసుందరాంగులగు నాసుగుణాకరులన్ గరంబు, బ్రీ
తిని గడుముద్దులాడుచుఁ బతింగని బిడ్డలనొప్పగించె నా,
పిననిల కశ్రు లిర్వురకు వేఁ గడుధారలు కార నేఱులై.

శా. ప్రారబ్ధస్థితిచేఁ బొసంగెడు సుఖప్రాప్తిన్ వ్యథాప్రాప్తినిన్
స్ఫారాహ్లాదము దుఃఖమున్ గనక యెవ్వండో పఁగా నేర్చుఁ దా
నారీతిన్ సుఖదుఃఖసంహతుల నిత్యంబున్ గనుంగొంచు యో
గారూఢస్థితిఁ బాయకుండును బుధుం డానందసంపూర్ణుఁడై.

చం. ఇరువుర బిడ్డలన్ గొని యసీంనశమంబున తేను మంత్రిశే
ఖరుని కరమ్మునన్ గరము గౌరవమొప్పఁగ నుంచినన్ బ్రజో
త్కరములుగాంచి వారల యఖండవిరాగము నెంచి బిట్టున
చ్చెరువడిరందు కొంద రిటుచేసితిమేయని కుంది రాత్మలన్.

ఉ. వారలలోన కొంద రతిభాసురబుద్ధివిశాలులంచుఁ బెం
పారినవారు వారలను నారహిమాఱుమనంగనీయ భూ
దారుని బుద్ధిమాటి పెడదారినిజ్జెరిన, వారిఁగ్రిమ్మఱన్
జేంచి రాజ్యమిచ్చునెడఁ జేయునదేమి యటంచు పల్కినన్.

కం. క్రమమున నేతథభిప్రా
యమె యుక్తమటంచు జనములందుఁ బలువు రా
ననుయుంబునఁ బసిపాపల
నమయించి శుభంబుఁగూర్ప సమయము సేయన్,

కం. అటు లవ్వారలు పల్కెడు
స్ఫుటవాక్యంబులకు సచివపుంగవుఁ డెంతే
సటకటపడి యర్భకులను
నటవికి ననుపుటలు చాలదా! యని వారిన్.

ఆ.వె వారివారి వాదవారంబులను మార్చి
ఉత్తమమగురీతి నొప్పగించి
అతిరయంబుమీర నర్భకు లిరువుర
సంపివైచె వారు హర్షమొంద.

మ. జరిగెన్ బిమ్మటఁ గొన్నివర్షము లటుల్ శాంతంబుగా నైనను
ర్వరకున్ రాణిగ వారుకోరుకొను సద్వంశోద్భవన్ రాజు తా
నరయన్ లేదిఁక నాప్రజాప్రతినిధుల్ యత్నంబులెన్నేనిఁ జే
సిరిగా కెందును గాంచలే రటులు వాసింగన్న కన్యామణిన్.

మ. అలినీలాలక యామె యుండ, నిఁకఁదా నన్యాంగనన్ బెండ్లికిన్
గలయంజూడఁడు జేఁడు, వారుగనినం గాంతామహాసక్తుఁడౌ
నలభూకాంతుని పెండ్లియాడఁగల యజ్ఞాక్షిన్ గనన్ జాలి రి
ట్టులు గాలంబగునంచు సందడులు బిట్టున్ రేగె రాజ్యంబునన్

మ. అతినన్ దద్పతి పూర్వరీతిగ నరణ్యంబందుఁ జేర్పించి స
మ్మతిమై వారల రీతినే సుముఖతన్ బద్మాక్షికై యత్నము
ద్ధతిఁ గావింపక రాజ్యమేలఁ దనసత్సంతానమేరీతిగా
నతఁడొందంగలవాఁ డటన్న నుడి రాజ్యంబందు మ్రోగఁగన్.

చం. అది విని ధారుణీరమణు డావిషయమ్ము సతీలలామ కు
న్నది కలరీతిఁ దెల్పుటయు నాతి సమస్తము నాలకించి నె
మ్మదిఁ బదిలంబుఁ జేసి పలుమారుఁ బరేశుఁ దలంచి నాథునిన్
సదమలభక్తి మ్రొక్కి సువచఃపరిపాక మెలర్ప నిట్లనున్.

గీ. "ఆగమాపాయులును ననిత్యములు నగుచుఁ
బొలుచు వైభవాముల రాకపోకలందు
మోదఖేదాళి నరుఁ డొందఁ బోలు నొక్క
తఱకు వానికిఁ గల్గు భేదంబుఁ దెలిసి.

చ. జనహితకార్యమై యిది యొసంగుట, మీరలు కూడ నిట్టులే
యొనరుప మేలటంచు మదినూహనొనర్చుట, నంతకంటె నా
కు నిఁక హితంబు కల్గునొకొ! కూరిమిమీరఁగఁ గాన కేగి యా
ఘనుఁడగు సన్మునీశ్వరు నఖండధృతిన్ భజియింతుఁ గ్రమ్మఱన్.

గీ. అంచులకుఁ గట్టబడి నట్టి జ్యానుఁ దు్రింపఁ
దగ యథాస్థితిఁ గొను బాణదండ మట్లు
పౌరవాసకారణులగు మీరు విడినఁ
బూర్వ వనవాసమున కేను బోదుసుండు!

చ. ఎసఁగు సుఖాసుఖమ్ములకు కొకింతకు మాఱని పూర్ణశాంతితోఁ
బసమెయి సర్వకార్యముల వర్తిలఁగల్గిన మేటి నేర్పుతో
నుసలఁగలట్టి మానవుఁడె మానవులం గడు మిన్న కాని యే
దెస కెదిరించియ నాదెస నతివ్యథఁ గూలెడు వాఁడు మర్త్యుడే!

మ. ప్రజలందే యొకమాటనుం బడని దివ్యంబౌ పథంబందు బి
ట్టుఁ జరింపంగల యద్వితీయ చరితాఢ్యుండైన శ్రీరామచం
ద్రు జయింపన్ దగు ధీరవర్తనులు మీఱొరంపుఁ దీర్మాన రీ
తిఁ జరింపం గని ధన్యుఁగా గలుగుటన్ దేటక్కు మజ్జన్మమున్.

మ. అని హర్షంబు మెయిన్ వచించి మహితోద్యత్ప్రేమ నొక్కుమ్మడిన్
దన పాదాశమఁ గవుంగిలించికొని కాంతారణ్య మెక్కింతసే
పునకున్ లోపలి కేగి భూషణతతిన్ బుట్టంబుల న్వీడుచున్
వనవాసార్హపు దుస్తులంగొని ప్రియాణంబై పతిం గాంచుచున్.

ఉ. "ఎచ్చట నెంతదూరమున సీతనువున్నను స్వాంతమెప్పుడున్
త్వచ్చరణాంబుజాతముల పజ్జనె నుమ్ము నిరంతరం బిటుల్
హెచ్చగు భక్తిఁ గాంచెదను, నహీనచరిత్రిక! దూరమెట్లు భా
స్వచ్చిరమైత్రికిఁగలదు భంగమొకింతయు నెట్టివారికిన్"

గీ. బర్హి మేఘంబులకు సహోత్పల హిమాంశు
లకును బద్మినీ దిననాథులకును దూర
మెంతయుండిన మైత్రి కేమెగ్గు కలిగె!
దూరమెందు సుజనమైత్రిఁ దోయఁ గలదె!

ఉ. స్వాంతము మీపయిన్ దను వవారితలీలవనంబులోన న
త్యంతము నిల్పియుండును, ధరాధిప! పట్టునుబట్టి య య్యయ
స్కాంతమునుండి లాగఁబడి క్రాలు నయోమయ సూచివోలె నీ
చెంతనె దృష్టిగల్గి విధిచేత వనస్థలి నేను నిల్చినన్.

మ. అతులంబైన విశాలభావములు సౌమ్యా మీకు పెంపారుటన్
సతినిం బిల్చి పరిస్థితుల్ తెలిపి స్వేచ్ఛన్ యుక్తమార్గంబుఁజొచ్చి
దరింపన్ కరుణంబు గూర్చితి, యశశ్శ్రీగోరి మార్మాటలన్ జతు
రత్వంబున గానకంపక, కృతజ్ఞన్ నీకు, ప్రాణేశ్వరా!

చ. సకలజనంబు సంస్తుతులు సల్పఁగ సద్గుణశోభితుండవై
ప్రకటవివేకమేర్పడగ రాజ్యజనుల్ కడుమెచ్చునట్లు సా
ధ్వికిఁ బతివై సమస్తమగు దివ్యసుఖంబులఁ బొందుచున్
ప్రజాళికి సుఖగాయకుండవయి లీలమెలంగుము ప్రాణనాయకా!

శా. ఏనారీమణి నిన్నుఁ జేకొనిన నేనీర్ష్యంగొనంబోనుసూ
నేనీదాననెగాన! నీజయసుఖానీకాదులే నావిగా
నానందించుచుఁ దద్వనాంతరములం దావాసముం జేయుదున్
నేనట్లుంటకుఁ జింతనొందకు, వని న్నేమోదమే పొందుటన్.

కం. కృపమాత్ర మెప్పుడు నాపై
నృపనాయక విడఁబోకు! నీవేగతిగా
విపినస్థలి వసియించెద
నపరిమితప్రియము నయము హార్దము నెసఁగన్!

శా. ప్రేమంబెంతయు నాపయిన్ గల మిమ్ముం వీడన్ మహాదుఃఖం
బై మత్ప్రాణము పోవనున్నను త్వదీయాదేశముంగొంచు మీ
యామోదంబె మదీయమోదముగ మత్స్వాంతంబునందెంచి యీ
సీమన్ వీడుచునుంటి మీపటమె మచ్చిత్తంబునన్ హత్తుచున్.

చ. సురుచిరహాసము దుష్టజనశుద్ధికరమ్ము శుభావహమ్ము భా
స్వరకరుణామయమ్ము సువిశాలము సంతతమందహాసభా
సురమును దీర్ఘనేత్రయుగశోభిత మార్యసుసేవ్యమానమై
వరలెడి నీముఖేందురుచి భావనదీపిక నాకు కానలోన్.

చ. బహుజన్మార్జిత భూరిపుణ్య ఫలసర్వస్వంబునై ఘోరదు
స్సహదుఃఖప్రవిదారకంబు విలసత్సౌఖ్యప్రదంబున్ శుభా
వహమున్ సంతతచింతనీయమగు నీపాదాబ్జయుగ్మంబుబ్రి
త్యహమున్ ధ్యానముఁజేసి కొందుబలమున్ దక్షానలోనిల్వగన్."

చ॥ అని నృపమౌళిగొద్ద సెలవందుచుఁ బిన్నలమందహాసశా
జిని, ఘనులన్ నతిన్, సములఁ శ్రీకరదృష్టిని, గౌరవించుచున్
వనికిఁబ్రయాణమై చనె నృపాలుఁడు మంత్రికి నర్థరీతిమై
వని వనితామణిన్ విడిచివచ్చుట కాజ్ఞనొసంగి పంపఁగన్.

క. తప్పని సరిగాఁ దనపై
నప్పని భారంబుఁ బడుట కాపగసుంతే
నప్పుడు శక్యముగామికి
నప్పట్టునఁ జింతమున్గి యాసచివుండున్.

శా. కార్యోద్వేగము వారువప్రతతివే గంబున్ గడున్ మీర సా
కర్యప్రాపక యోజనావళియుఁ జక్రింబట్టుదొర్లంగ, నౌ
గార్యోదంచిత రాణిపైవు మదియున్ దత్పట్టణాశన్ దవీ
యార్యస్తోము నహార్యధైర్యఘన దేహంబున్ జనన్ గానలోన్.

శా. నానాడున్ దనకాపకానిగతినిన్ వ్యాపారముల్ సీమనెం
తేనిన్ జిత్రముగాగ మారుటయుఁ గానే మార్పునున్ జేయలే
కానారీమణిఁ జేతులారగ నరణ్యంబందునన్ జేర్పగా
నానాకర్మముఁ గాంచుచున్ సచివుఁ డత్యంతవ్యథాపూర్ణుడై.

మ. యతివేషంబునఁ గోసలావనిని నేయత్నించి యెల్లెట్లో యీ
సతిమార్గల్లి యొనర్చినట్టి చెయివుల్ సర్వమ్మునున్ బైకిఁదె
ఛ్చితి నైనన్ దవధీశుఁ డామెఁగనఁ బిచ్చింజెంది దేశంబుపి
డి తదారంభముగాఁ గనంబడమి నెండన్ మన్మహాశాలతల్.

ఉ. "మర్మములేని నిర్మలిన మానసమేర్పడనేని యుక్తమౌ
కర్మమొనర్తునేని మహికాంతుడురాణియు నెట్టివేళలన్
ధర్మముతప్పనట్టి మహితప్రతిభాన్వితులేని దేవుఁడే
ధర్మముబ్రోచునేని యిటతప్పక నాకృషిసాగి తీరెడిన్."

ఉ. గణ్యాతవిహాయు పుణ్యుఁడయి క్రాలెడి దీనశరణ్యు దుర్గమా
రణ్యగహానిరాట్సమవిరాగమనస్కుల సత్ప్రభుత్వనై
పుణ్యమునందు గణ్యుఁడగు భూపవరేణ్యశరణ్యునంత బ
హ్మణ్యుని నట్లు జూడ మనసొడక యేమొ సనెన్ దినేశుఁడున్.

మ. దినమెల్లన్ బలశౌర్యముల్మెఱయ మందేహాదిదైత్యాళి సం
హానక్రీడనుసల్పి సల్పి నిజశౌర్యాటోపముల్ దగ్గఁజే
సి, నిరాడంబరమూర్తియై కమలినీచేతంబు లల్లాడఁగాఁ
జనె దిక్చక్రముచాటుగా నినుఁడు విశ్రాంతిన్గొనన్ జూచుచున్.

క. స్ఫురితతరచారుచామీ
కరహయఖురపరివృత్తరేణు ఘనరాగమునా
నరుణహారిద్రగభస్తులు
ఖరకరుఁ డరిగిన పథానఁ గనఁబడె నంతన్ ।

చ. సమముగ జారచోరజనసంఘముదావహమై యటం గ్రిమ
క్రమత బ్రపంచమంతయు సరాసరిగా మసిఁబూసినట్లు గా
ఢముగనుఁ గన్నుఁగన్నుగనుటల్ గడుఁగష్టమునొచుఁ దోఁప సం
తమసము నిండె నేకమునొనర్చుచు లోకము నెల్ల వ్రేల్మిడిన్॥

చం. సచివుమనంబునందెసగు సాంద్రతమంబగు నంధకారపున్
నిచయమెరేగి మెట్టెదుట నిల్చెనటుల్ సబిడీకృతంబు బి
ట్టచలములై తమంబెసఁగ నంటునముందునకేగలేక తా
నుచితముగాఁదలంచె సచివోత్తము డందున గొంతనిల్వఁగన్

గీ. ఇనుఁడుగ్రుంకినతఱి రాజ్యమునను రేఁగి
పలుతెరంగుల లేచు శక్తులను బోలె
ఇనుడుగ్రుంకినతఱి నభమ్మునను దార
లొక్కడొక్కడు కనిపించె నోజవెలయ.

సీ. ప్రభుకార్యములఁ దీర్చుపనిపైని
దినరాజు నిల్పజేసిన ప్రతినిధి యనంగ
నౌషధలతికాళి నభివృద్ధినందింప
విధివిధించిన వైద్యవిభుఁ డనంగ

కలచేష్టగమనింప నలచిత్రగుప్తుండు
జగములనిల్పిన సాక్షియనఁగ
సృష్టిని సాగింప శృంగారమును బెంపఁ
గాముని తోడైన ఘనుడనంగ

గీ. నఖిలజీవిజీవనసుసౌఖ్యప్రదుండు
మహితహిమకాంతికాంతసమస్తలోకుఁ
డనుచు ఘనకీర్తిగంట సుధాంశుఁ డనఁగ
నలరె డంబునఁ గ[illegible]వఱెఁ డంబరమున.

చం. జనహితకాంక్షుఁడౌ నృపతి సద్యశమట్లు సితత్వమొప్పు కాం
తిని జగమెల్ల వెండికరణిన్ గనఁజేయుచు సర్వలోకజీ
వనముగ నొక్కటన్ బ్రకృతిపక్కన నవ్వినయట్లు నిండుజ్యో
త్స్నను వెలయించె లోకమునుఁదద్దిమధాముఁడు మోహనంబుగన్.

మ. ఒక గ్రంథాన నొకొక్కసంగతిని నత్యుత్సాహియై గొంచు స్వీ
యకవిత్వంబునఁ జేర్చికొంచుఁ దనదుర్వ్యాపారముల్ దాఁచు నా
కుకవింబోలుచు భాస్కరాదులకతల్ గొన్నట్టి యవ్వాని భూ
మికిఁజూపించుచు వెన్కభాగమును నెమ్మిన్ దాఁచుఁజంద్రుం డుర్విన్.

గీ. తమమునందును సుఖముదృష్టమగుఁగాని
హానివృద్ధియు తమ్మ్మ వ్యయమ్మ్మ మితము
నంచుఁ దెలుపంగ నేమొ నయ్యబ్జవైరి
యించుమించుల కాంతుల నిచ్చుదిశల.

చం. అధిపులచే ముహుర్ముహురుదద్భుతశిక్షలనందుచున్న నె
వ్విధమునైన స్వీయపదవిన్ విడలేని నియోజితుం బలెన్
విధుఁడు కళంకియై యుడుల పేరిటి సభ్యులఁగూడి యెట్టులో
కథనడిపింపఁ జూచెడునుగా పదహీనుఁడు గాక చాతురిన్.

మ. తగులీలన్ దమదేశమభ్యుదయమందం జేయ భూనాథులెం
తగ శక్తుల్ గలిగించినన్ జనులకున్ దర్పాన దుఃఖంబునీ
యఁగ నుద్యోగితలంచునట్లు శశి యుష్ణాదుల్ దినేశాదులొ
ప్పఁగొనన్ గాని జగాలకిచ్చునవి వంతల్ శైత్యకామాదులున్.

ఆ.వె. అలుకబోడి ఫక్కుమని నవ్వినవిధాన
పుచ్చపువ్వులొకట విచ్చినట్లు
పిండియారఁబోయు వెరపున వెన్నెల
వెలయు వేళ మంత్రి విపినమందు

మ. వసుధామండలమున్ సుధామయముగా భాసిల్ల సేయంగ నో
వుసుధాంశుండు దితుండగా సదివుడప్పాజ్యున్ మహారాజ్ఞినిన్
వెస వీక్షించు దిశాతటుల్ వలెనె తెల్వింబొందు సంశుద్ధమా
నసమేపారఁ బురమ్ము సేరగ బ్రియాణంబయ్యె నమాత్రియున్.

శా. తదాత్రిక్షి భవితవ్య మేమగునో యేతన్నామకస్తోమముల్
తదాత్రిజ్యంబున నేమొనర్తురో నిజోద్యద్యత్న మేమౌనో యే
తదాత్రిజన్యవతంసుధర్మవిధ మేదారిం బ్రవర్తిల్లునో
భద్రింబేగతిఁ గల్గునో యని తలంపంజొచ్చె నెంతేనియున్.

గీ. ఘోరమృగముల క్రూరంపు టారవములు
నతులసంకుల ఝిల్లీరవావళియును
నతిమనోహరవిపినదృశ్యప్రికరము
చలితు జేయ వాని యోజనలవలన.

కం. ప్రాన్మృణ్ణోరదవారము
లోవెలసెడి మెఱపుకరణి లోఁదమమొడలం
గా వెలిగెడి యాలోచన
మా విజ్ఞునిఁ దేర్పనాత డాపురిఁ జేరన్.

చం. పలుప్రకు నేమతంత్రములొ పన్నుచునుండి తదీశురాక నె
ట్టులొ విని మెల్లజారెడునటుల్ దిననాథునిరాక వేగుచేఁ
దెలిసి మొకొక్కటే యుడుల దృశ్యముగా శశి పట్టుబడ్డదాం
గలగురువట్లు తెల్లనయి కన్పడె నంబరవీధి వింతగన్.

ఆ.వె. కాలదశేత నొకట జ్ఞానవాసన సోక
వ్యాప్తతమములెల్లఁ బాయుకరణి
సురుచిరంబుగాఁగ సూర్యోదయము దోపఁ
దమములెల్లఁ గ్రమతఁ దలఁగఁ జొచ్చె.

గీ. పరిజనులు గర్హించు దుష్టవర్తనముల
కుక్కురుక్కోయటంచు నా కుక్కుటములు
జీవనంబులు స్థిరములు కావుకావ
టంచుఁ గాకులు కూసె దిగంతములకు.

చ. తమసము వోవ నీరజవితానము లుబ్బిన లేవ శీతవా
తము లిల నీవ హైమకణతండము తళ్తళలాడిపోవ దు
ర్దమఘనజారచోరనికరమ్ములు మూలలదూరు లేవ నా
ద్యుమణి నభస్థలిన్ బొడిచె నుత్తమలోకము సంస్తుతింపగన్.

గీ. ఘనతమోవృతమైన యజ్ఞానిహృదయ
మున మహాశాకిరణ మట్లు బొల్చిపొడమె
ఘనతమోవృతమైన జగమ్మునను స
హస్రకిరముల ప్రభువు శక్రాశయందు.

గీ. గుములుగాఁ గూడి విహరించు నమితమైన
తూబరమాలాది భీరుజంతుతతు లెల్ల
హరికిశోరంబు వాసి మాయమగునట్లు
లుడుపహిమాంశులఁ జనిరి సూర్యుండు పొడమ.

శా. ప్రొద్యన్మేఘసమావృతుండయిన సూర్యుం డాత్మతేజోరమన్
జోద్యంబొప్పఁ దదంబుదప్రతతిన్ సూక్ష్మంబుగాఁ ద్రోలి ని
ర్భేద్యజ్యోతి జెలంగునట్లు నృపుడున్ వేధించు కష్టావళిన్
దద్యత్నంబునఁ ద్రోలి దీప్తిఁ గన నాత్మన్ మంత్రియూహించెడిన్.

మ. ధరణీజాహృదయాబ్జమిత్ర! జలదోద్యద్గాత్ర! నీరేజనే
త్ర! రసోదంచితసచ్చరిత్ర! విబుధత్రాణైక దీక్షాపవి
త్ర! రణోద్ఘాటితశత్రుగాత్ర! బుధసంతాపాటవీవీతిహో
త్ర! రఘూద్వంశపవిత్ర! ధీరనుతిపాత్రా! మిత్రగోత్రోద్భవా.

భూతిలకము: శిష్టజనావళిపోషణా! నృపశేఖరాన్వయభూషణా!
దుష్టనిశాచరభంజనా! పరితుష్టమానసరంజనా!
దృష్టివినిర్జితదానవా! నిజధీసముద్ధితమానవా!
సృష్టఖిలసద్గుణభాస్వరా! మహిజాహృదంబుజభాస్వరా!॥

తోదకము:- కామ్యఫలప్రదగౌరవనామా!
సౌమ్యజనస్తుతసద్గుణధామా!
రమ్యశరీరనిరాకృతకామా!
భూమ్యధిపస్తుతభూపలలామా!

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధౌరేయ
కౌండిన్యగోత్రపవిత్ర ముత్యవంశపయః
పారావారరాకాసుధానిలయ కామేశ్వ
రాంబానూర్యనారాయణార్యతనయ
విబుధవిధేయ శ్రీ సుబ్బరాయ
ప్రణీతంబైన నిశ్శ్రేయ
సానందకావ్య మందలి
తృతీయాశ్వాసము

సంపూర్ణము.



# నిశ్శ్రేయసానందము.

## చతుర్థాశ్వాసము

శ్రీజయబలదచరిత్రా!
నైజదయాపూర్ణనేత్ర! నారదగాత్రా!
భూజానికులపవిత్రా!
భూజాహృదయాబ్జమిత్ర! బుధనుతిపాత్రా! ॥ 1

శ్రీయందుఁ విభవంబునందు గడువాసిన్ గన్నవాఁడైన నె
న్నోఁ యిక్కట్టులపాలుజేసి మతిశాంత్యుత్సాహముల్ పాయఁగా
జేయున్ గర్మమదెట్టిచిత్రమొకదా జేజేలనుంగూడ! వి
జ్ఞేయజ్ఞాతయు నొందకుండునె విరక్తిప్రాభవోపేతుఁడై. 2

కాననమందు రాణివిడి గణ్యచతు్రఁడు బుద్ధిసాగరుం
డానయవర్త్మ కట్టిగతి నాపగలేమికి నెంతయేనిఁ దా
నాననమెత్తలేని త్రప నందుచునుండుటఁజూచి నాయకుల్
వానిసమర్థరీతిగనె భాషణఁజేయుచుఁ దేర్చిరెంతయున్. 3

క్రమమున నాసుశీల నటుకాననమందున వీడువార్త రా
జ్యమునఁ బ్రకాశితంబగుట నట్టిసులక్షణపోవ నింకసౌ
ఖ్యము గననేర్తుమే యనుచు నాడెడువారును నట్టియద్వితీ
యమహిళ నింకగాంచమని యాడెడువారును నైరి తత్పురిన్. 4

అందలికొందఱన్నిటను నానరపాలునకర్హమైనదౌ
సుందరకన్యకామణిని జూచి వివాహము సల్పితీరఁగా
డెందములందుఁ దీవ్రమగు శేవలబూనుచు నెన్నియేని యె
న్నందగు కన్యకామణుల నవ్యపటంబులఁ దెచ్చిచేర్చినన్. 5

ఎన్నెన్ని చిత్రపటముల
న్నన్నరనాయకులుదెచ్చి యధిపున కిడుచు
న్నన్నరపతి యంతొందును
కన్నక యన్నిటినిమున్నె యెంతయుఁద్రోసెన్. 6

చ. అనృతము నెట్టివేళలను నాఁడియెఱుంగనితేఁడు నచ్చకుం
డిననొకకన్నె నచ్చెనటు నెమ్మివచింపఁగలేఁడు తజ్జన
మ్మునకు ముదమ్ముఁ గూర్ప, నిజముంగన నాతనియాత్మ కెక్కఁ జా
లిన పటమాజనమ్ము నెడలే రిఱువంకను బొందిరెంతయున్. 7

ఉ. రమ్యతయున్న నుండదటవా ప్రభవ. మొక్కట నద్దియుండినన్
సౌమ్యతయొన్న నద్దియు నెసంగినచోటఁ గులంబు నందువై
షమ్యము దోఁచు నందుఁ గడుజక్కఁగనున్న మఱొక్కలోటునై
భూమ్యధిపాగ్రగణ్యుమది పూర్తిగనొందును నచ్చకుంటచేన్. 8

మ. కడకానాయకు లెన్నియోజతనముల్ గాఢమ్ముగా సల్పి యె
క్కుడు తన్మంత్రియుపాయమున్ సలుపఁ జేకొగల్గి రాసింఘురా
జిడు తత్పుత్రికచిత్ర మిద్దిగని యమ్యోగాక్షి యేసచ్చితీ
రెడు నాభూపునకంచు నెంచి కడుహర్షింపంగ నైరెల్లరున్. 9

మ. సకలంబౌశుభలక్షణంబులను భాస్వద్వర్తనంబందు రూ
పకళాశోభలఁ బూర్వరాజ్ఞివలెఁ దత్పద్మాక్షి భాసిల్లి యిం
చుక ప్రాయంబున లేతయై చుఱుకునన్ సుస్ఫారలావణ్యమం
దకలంకమ్ముగనుంట నాపెను నృపుం డాసించునంచెంచుచున్. 10

ఉ. వారు తదీయచిత్రమును పార్థివచంద్రునకిచ్చి యామెసు
స్ఫారగుణాదులన్ మిగులసంస్తుతిచేసి వచించి యట్టి స
ద్ధీరసులక్షణాఢ్య తమదేశముఁ జేరిన సర్వశోభల
వ్యాదిగఁ గల్గితీరునని వారు పదింబది పల్కుచుండగన్. 11

ఉ. కన్యకలక్షణావళులఁ గాంచఁగ నట్టినయంచు రాజసన్
ధన్యతనందురీతిగనె తజ్జనులెంచి నృపాలుచిత్ర మా
కన్యకకందఁ జేయఁగ నఖండగుణాన్వితయైనయట్టి యా
మాన్యయుఁ దచ్చరిత్రము సమస్తమెఱింగికొనంగఁ జూచుచున్ 12

శా. కర్ణాకర్ణికగా నరాధిపుడు మున్ గాఢంబుగా నెంతొసం
పూర్ణప్రేమ వివాహమాడిన పువుంబోడిన్ మహాసత్వసం
కీర్ణంబౌ వనమందు వీడెనని పంకేజాక్షి యాలించుటన్.
దూర్ణప్రక్రియ నామెనొక్కపరి దానున్ జూడఁగాఁ గోరినన్. 13

చ. తిరవులనుండి దేశములఁ దద్దయుఁ గ్రమ్మఱి చెందుచున్న య
య్యుదుమలు నాఁటికోనుడుగ నెంచుచు నుండెడువారి కామెయి
వ్వడువునఁ బట్టి నాముడు లపారముగా వ్యథఁగూర్చె నింతకున్
బడినవ్యాధాళి స్వర్గమగుమాదిరి తోఁచుటచేత వారికిన్. 14

కం. పిడుగులు వడివడిఁ బడియెడు
పడువున నుడివిన నుడువుల భయపడిరి కడున్
బడియుక నుడివిన పడువున
నుడివిన నప్పుడతి కేమి నుడువునొ యంచున్. 15

కం. అవ్వాఁ [illegible] బడు
నవ్వాఁ దిలకించి మంత్రి రేవ్వెనొయి ధృతిన్
సప్తటలఁ జేసి [illegible]
కన్వాది గుణాళిఁ దెలిపి యతినిపుణముగన్. 16

మ. సచివాగ్రేసరుఁ డాథరాధిపుని పజ్జన్ నిల్చి సర్వస్వమున్
వచియించన్ బటుమంతు లేమఁ గనులన్ గంటాదిగా నన్యకా
ర్య వచనం బేమియుఁ దోచ కొక్క పరిబద్ధాక్షిన్ గనన్ గోర్కితో
ముచు నాక్రొల్యము పేరుయో కలచు నంచు న్బల్కెడెంతటన్.

కం. ఒక [illegible]
రికటి [illegible] బేమంబున తే
[illegible]
యకలంకుఁడు మంత్రి నోయి నాననమునకున్. 18

మ. 'కనుఘన్నంబున బద్ధుఁడై క్షమఁ గొనంగా నెత్తిగా దాష్ట్యమే
చెడివేళన్ గనుఁగొంబిఁగాఁగఁ, దటినిత్తింపన్ దరిన్ నిల్చి నా
తఁడు నిప్పనుడుగాఁగ హేయమతిఁ గుత్సాకర్మవై ముఖ్యమా
నెడివేళన్ విరసుండుగాఁ దలచుటల్ నీచంబు ధీరాత్మునిన్'. 19

శా. ఎంతే నీగటినున్న తత్స్థితిని మంత్రీశుండు డెందంబునన్
జింతంజేయుచు భక్తిరక్తి గదురన్ నిశ్రేయసానందులం
దెంతేఁ బొల్చెడి సద్గుణంబులనుఁ దానే గెన్ననిన్ జేర స
ర్వాంతర్యామినిఁ దాఁచలం దుఁజని సాయంబాటకున్ మ్రొక్కుచున్.

చ. అనృతము నెట్టివేళలను నాఁడి యెఱుంగని ఱేఁడు నచ్చకుం
డిననొకకన్నె నచ్చెనటు నెమ్మి వచింపఁగలేఁడు తజ్జన
మ్మునకు ముదమ్ముఁ గూర్చ, నిజముంగన నాతని యాత్మ కెక్కెఁ జా
లిన పటమా జనమ్ము నిడలేరిటు వంతను బొందిరెంతయున్. 7

ఉ. రమ్యతయున్న నుండదట ప్రాభవ. మొక్కట నద్దియుండినన్
సౌమ్యతశూన్య మద్దియు నెసంగినచోటఁ గులంబు నందువై
షమ్యము దోఁచు నందుఁ గడుజక్కఁగనున్న మఱొక్కలోటునై
భూమ్యధిపాగ్రగణ్యు మది పూర్తిగనొందును నచ్చకుంటచేన్. 8

మ. కడకానాయకు లెన్ని యేజతనముల్ గాఢమ్ముగా సల్పి యె
క్కుడు తన్మంత్రియు నాయమున్ సలువఁ జేకొగల్గి రాసింధురా
జిదుతత్పుత్రికచిత్ర మిద్దగని యమ్మేణాక్షి యే నచ్చి తీ
రెదు నాభూపునకంచు నెంచి కడుహర్షింపంగ నైరెల్లరున్. 9

మ. సకలంబౌ శుభలక్షణంబులను భాస్వద్వర్తనంబందు రూ
పకళాశోభలఁ బూర్వరాజ్ఞివలెఁ దత్పద్మాక్షి భాసిల్లి యిం
చుక ప్రాయంబున లేతయై చురుకునన్ సుస్ఫారలావణ్యమం
దకలంకమ్ముగనుంట నామెను నృపుం డాసించునంచెంచుచున్. 10

ఉ. వారు తదీయచిత్రమును పార్థివచంద్రునకిచ్చి యామెసు
స్ఫారగుణాదులన్ మిగులసంస్తుతిచేసి వచించి యట్టి స
ద్ధీరసులక్షణాఢ్య తమదేశముఁ జేరిన సర్వశోభల
వ్యాదిగఁ గల్గితీరునని వారు పదింబది పల్కుచుండగన్. 11

ఉ. కన్యకలక్షణావళులఁ గాంచఁగ నట్టివయంచు రాజనన్
ధన్యతనందురీతిగనె తజ్ఞను లెంచి నృపాలు చిత్ర మా
కన్యకకందఁ జేయఁగ నఖండగుణాన్వితయైనయట్టి యా
మాన్యయుఁ దచ్చరిత్రము సమస్తమెఱింగికొనంగఁ జూచుచున్ 12

శా. కర్ణాకర్ణికగా నరాధిపుడు మున్ గాఢంబుగా నెంతొసం
పూర్ణప్రేమ వివాహమాడిన పువుంబోడిన్ మహాసత్వసం
కీర్ణంబౌ వనమందు వీడెనని పంకేజాక్షి యాలించుటన్.
దూర్ణప్రక్రియ నామెనొక్కపరి దానున్ జూడఁగాఁ గోరినన్. 13

శా. ఉత్సాహంబున సద్ద్విజావళులతో నుత్కంఠమై బోడుచున్
వాత్సల్యంబున నేణులంగలిసి సద్భావంబుమైనాడుచున్
జిత్సంవిత్సుఖరూపలీలలను మానింజేరి భాషించుచున్
సత్సాంగత్యముమై గుణీకృతమహానందమ్ముతోఁ గ్రాలుచున్. 21

చం. తన చిరునవ్వు వెన్నెలల దద్వనమెల్లఁ గడున్ బ్రకాశితం
బౌనరుచు చున్ మృదుప్రవిమలోక్తుల నవ్వనచారిణీసఖీ
మనముల నుల్లసంబడుచు మంజులభాషలచేత సేవచే
ముహృదయప్రమోదదగఁ బొల్చుచు రూపముఁగొన్న మోదమై.

శా. ఉత్కంఠన్ మునిరాజునొద్ద నిగమాంతోక్తుల్ విమర్శించు నే
తత్కాంతాజనసంస్తుతాంచితచరిత్రన్ లేమ నిశ్శ్రేయసన్
దత్కాంతారమునందుఁ జూచి వినయోద్యద్భక్తిమై మ్రొక్కి తా
నుత్కంఠన్నుచిపుండు లేఖకనుఁ జేనుంపంగ నారాణియున్. 23

ఆ. వె. 'కర్మమునఁ బొసఁగు నగణ్యచిత్రంబులఁ
దెలియఁగలుగువారుఁగలరె యెందు?
సంభవముల వడి నసంభవములు సేయుఁ
దలఁపనట్టిపనులు గలుగఁజేయు. 24

చం. ఒకనియనుగ్రహంబునకు నొక్కని యాగ్రహదృష్టికిన్ మఱొ
క్కొకనిమహోన్నతస్థితికి నొక్కని నీచపుమన్కికిన్ జనుల్
ప్రకటితకర్మమొండె నుదువందగు కారణమంచు నెంచనే
రక యితరంబు నెంతురవురా, కతనుంచు విమోహయుక్తులై కడున్. 25

శా. పంకేజాసనవాసవప్రముఖదేవస్తోమముల్గూడ ని
శ్శంకప్రక్రియ నిచ్చఁదిప్పఁగల ప్రజ్ఞంగల్గు నాకర్మమీ
వంకన్ రాజ్యముఁ జేరనన్ను నియమింపన్ గోప కింకేటి కా
టంకం? బెల్లరునన్నుఁ బంపరె సుహృష్టస్వాంతులై యుంచుఁదాన్.

చ. తలపగ నామదిం నిలుచు తద్విభుహాసయుతాస్యచంద్రమం
డలమును గాంచుచున్ నిలుచు డంబున నాతని భూరిసద్గుణా
వళియు విశాలభావములుఁ బాయక నాదుమనంబునందుఁ ని
చ్చలు వెలయున్ గదా! నృపుని సంతతదర్శన మెట్టిభాగ్యమో? 27

శా. ఆధీరాత్ముని యాజ్ఞచేత విధిచే నత్యంతమున్ బద్ధనై
యాధారంబు నృపుండుగా ననిని సేనావాసమున్ జేయ నం
తేధన్యత్వయునొందనోకొ! పురమత్యేష్టంబునన్ నన్ను
మన్మధుం డచ్చటికేగుదెమ్మనుచు నానంబుచ్చినం బ్రేముడిన్". 28

కం. అని యిటు పరిపరివిధములఁ
దననాధుని సద్గుణప్రతతినిన్ మతి యో
చనసేయుచు నిశ్శ్రేయస
తనదు ప్రియాణప్రియత్న తత్పరతఁ గడున్. 29

చ. ముదుసలియొద్ద నామొహితము న్గనగోరెడు ప్రాణతుల్యతా
ముదితలయొద్దనున్ సెలవుఁబొందుచుఁ బెంపుడులేళ్లఁ బ్రీతిమై
గదిసి సఖాలద్రుప్పి సుమకాండములొక్కటముద్దువెట్టి తాఁ
గదలె నమాత్యుఁ డాయితముగా నొనరించిన తేరునెక్కుచున్. 30

శా. ఈనిశ్శ్రేయస శానవీడి పురికై యేతెంచు టాలించుచున్
దానేమెంచెనొ కాని, సింధుపతి యుద్యత్సత్సభఁ జేసి, యా
యానందప్రభునిన్ జనావళినినయ్యబ్జాక్షి, నిశ్శ్రేయసన్
దానాహ్వానముఁజేసె గౌరవమహానందంబు లేపారగన్. 31

మ. సచివాగ్రేసరు పోద్బలంబుపయి నాసర్వంసహాపాలకుం
డుచితంబౌ పరిహారమున్ సతియు నత్యుత్కంఠమై నాయకా
ళి చమూరాజియు వెంబడింపఁగ మహాలీలన్ సభన్ జేరఁ గో
రి చనెన్ భావిగతిన్ రనంతయున నేరీతిన్ విమర్శింపకే. 32

శా. ఈరీతిన్ దనుదేశమున్ వదలి సుంతేదూర మవ్వారలే
తేరన్ యుద్ధపువాద్యముల్ పిదపఁ దద్విఖ్యాతుసైన్యంబుపై
నారాచమ్ములు రాగ సింధుపతి తన్మర్యాదకైయెంచి తా
నారీతిన్ బొనరించియుండునని యూహంజేసి రవ్వారలున్. 33

చం. క్రమమున ముందువెన్కల నగణ్యబలమ్ములు మూగి బాణవ
ర్షముగురియంగ నెల్లరుఁ గరమ్ము మహోద్భుతమంది మంత్రిధీ
రమతిబయల్పడన్ ద్రుటినిగ్రోలఁగఁజేసిన మోహరాననుం
త్తమగతి నిల్పి సల్పిరతిదారుణరీతి మహాహవమ్మటన్. 34

ఉ. సీరియు శౌరి భార్గవులు కాలగ నోడు ప్రతాపమొప్ప భూ
దారుని నాటిసంగరవిధాన మొసంగె మహాద్భుతంబుగా
నారవిజీవభార్గవుల కందగరాని విచిత్రలీలఁ నెం
పారెను ధింధిమిటిమ వాసచివాగ్రణి గ్రాలినాడలన్. 35

చం. అధిపప్రతాపశక్తియుచు నాసచివాగ్రణిమంత్రయుక్తియున్
మధురవచః ప్రభావయుగ మానికయుత్సుకస్ఫుక్తియు
త్యధికమ్మైన తత్ప్రజలపాలించితమా ప్రభుభక్తియున్ మహా
సిధులయి యుగ్రరితిగ నసిన్ బొనరింపగఁజేసె వారికిన్. 36

శా. ఆసైన్యంబలకోసలాధిపుని సైన్యమ్మాటయున్ రాజతే
కాసైన్యంబును మంత్రిమోసఁగుసగా నైయుంట వీక్షించుచున్
పీసంబైనను యుద్ధకారణములన్ వీక్షింపలేకున్న జే
డాసైన్యంబులఁ దూలనేసె ఘనశౌర్యాటోపమేపారగన్. 37

ఉ. ఆహవమందు నెల్లెడల నానరనాయకపాళియై చమూ
వాహిని నెల్ల వారలకుఁ బాయనియుండగనై మహాబలో
త్సాహముఁబస్పటిల్ల రిపుసైన్యమురిద్ధవశంగఁజేసెఁ గ
త్సాహసన్పృస్తులంగనుచు సాధ్వసమందె దిక్పతుల సంతతుల్. 38

చం. మెఱయుచుఁగంటికి సైనికులమేయబలాన్వితుఁడున్విదేహభూ
నపరిరక్షితుల్ కుధరభాస్వరధైర్యులు జూపు మహోగ్రసం
గరకుశలత్వముంగని యఖండముగా నెఱగంద దిక్కులన్
బరితెగిపోవుచున్న నిజవర్గముఁ ద్రిప్పుచు వారిమంత్రియున్. 39

మ. అతికోపాగ్నిని తాల్చుఁజూచు నతిశౌర్యక్రోధముల్ మీఱ శ
త్రుతతిన్ మగ్గవోసర్పిగొంచు ఘనవిద్యుద్వేగ మొప్పన్ మహా
ద్భుతిఁ జేరంజని బుద్ధిసాగరుని యుద్ధస్యందనంబున్ వడిన్
శతబాణమ్ముల నొవ్వనేసి పలికెన్ సక్రోధుడై యీగతిన్. 40

శా. “దోర్గండాంచిత చాపశింజనిగడున్ దూర్తంబుగా లాగి మ
ద్దుర్గాంతాద్భుతవిక్రమంబుమెఱు నీదుర్గర్వసర్వస్వ మా
యుద్ధాయంబు సమాప్తిఁ జేసి భవదీయోగ్రానుబంధింతు వే
మర్దింతుఁగా భవదీయసైన్యముల సామర్థ్యంబు దీపింపగన్. 41

శా. యతివేషంబున లోనఁజొచ్చి యెపుడో యైనట్టి సందర్భముల్
చతురత్వంబునఁ బైకిలాగి యెటో మత్సర్వంసహానాథునిన్
మతిపోనంబొనరించి రాజ్యమున సంబద్ధుండుగాఁ జేసి తీ
వతిదౌష్ట్యంబున, ఁగాచికొమ్ము భవదీయాధీశునిప్పట్టునన్! 43

శా. "సామర్థ్యంబున నేను రాజ్యమునకు నిచ్ఛల్ గ్రోవకేయున్న చో
నేనైయుండునొ నీతలంపుమెయి నేడింతేల నేనెంచిన
ట్లీమార్గంబున వీనుపచ్చిపడుటే యెంతేనితార్కాణమా
నానానాధుడుమాధవున్ మనుపనుస్వాంతుండుగానుంటకున్."

మ. అని యేమేమొ వచించుచుండ నని హాహాకారముల్ రేగ ని
మ్మనినానందనృపుండు కోసలచమూపున్ క్రూరనారాచపం
క్తిని ఘూర్ణిల్లఁగ నేసియుండుటను, నార్తిన్ తచ్చమూసంతతుల్
కనగా దిక్కులులేకపారి రటలెక్కన్ మీఱి యొక్కుమ్మడిన్. 44

శా. ధైర్యప్రక్రియ శౌర్యధుర్యులగు యోధగ్రామణుల్ వచ్చి సా
కర్యంబేర్పడ మంత్రినాసచివముఖ్యస్నేహితాళిన్ రణా
చార్యుండౌ నలబుద్ధిసాగరుని యాజ్ఞారీతిబంధించి యౌ
దార్యంబొప్ప విదేహరాజ్యమునకుద్యద్రీతిమైఁ జేర్పగన్. 45

చం. ఉచితగతిన్ విదేహకు మహోత్తమరక్షణమీయఁగా నమే
యచతురతన్ దదీయసచివాదులఁ గాచుచునుండ నష్టులన్
సచివుఁడధీశుఁడున్ నియమనంబొనరించి ప్రయాణమైరి, సై
న్యదమజయధ్వనుల్ నభమునంటఁగ, సింధుపతిన్ గనుంగొనన్.

కం. అనుకొనని హఠాత్సంఘట
నను రాజ్యామాత్యవరుల నైజబలమతుల్
గనితిత్త్రిజపల్లసు గొను
ఘనమోదమునఁ దెప్పదరమె కంజభవునకున్! 47

కం. వీరరుదెంచు మనుంకుట
వీపుం[illegible] జు విని ముదములరన్
పీరికిఁ గొ[illegible]గ
స్వామివివేషంబు బసచె వారికెదురుగన్. 48

కం. ఆరాజమౌళియును న
వ్వారలఁ దగురీతి గౌరవముఁ జేయుచు న
వ్వారల కుచితస్థలు ల
వ్వారిగ నేర్పాట్లుసేసె వైభవమెసఁగన్. 49

మ. తనదౌ నెచ్చెలిపిండుతో గదలి యేతత్సింధురాట్పుత్రి యు
మ్మున నిశ్శ్రేయస నాపె నెచ్చెలుల సంపూర్ణప్రభాగౌరవా
ళిని సమ్మానముఁజేసి యంతిపురి నోలిన్ జేర్చి తానెంతయున్
జనవొప్పన్ గడునిష్ఠగోష్ఠిఁ గడపెం గాలంబు మోదంబునన్. 50

శా. శ్రద్ధాభక్తుల సర్వదేశవిబుధవ్రాతమ్ములన్ జేర్చి స
మృద్ధిన్ ధార్మికశాస్త్రచర్చలను సంపూర్ణంబుగాఁ జేయ సం
శిద్ధుండౌ పరిణద్ధబుద్ధియగురాజున్ దానికధ్యక్షుఁడై
సిద్ధింపన్ బొనరించె భూరిసభ నాసింధుక్షితీశుండటన్. 51

శా. ఆయానందనృపాలుపాండితికి యుక్తాయుక్తసంవీక్షణా
మేయప్రజ్ఞకు వాదశక్తికిని సంప్రీతాత్ములై పండితుల్
ధీయున్ వైభవమున్ బలంబొకట సందీపించెనం చెంతయోఁ
జేయంజొచ్చిరి వానిసద్గుణతతిన్ జిత్రంబుగా స్తోత్రముల్. 52

పంచ. అశేష శేముషీ యశోసుఖాభభోగభాగ్యముల్
విశేషసంపదాయురర్థి విత్తవైభవాదులున్
నిశాపమౌళి యిచ్చి ప్రోవ నెమ్మివేడిరాబుధుల్
దిశల్ కడున్ వెలుంగన వ్విదేహరాజశేఖరున్. 53

చం. ధనమధికారమున్ గలిగి ధార్మికవిద్యలయందు నీగతిన్
ఘనమగు శ్రద్ధయాదరముఁ గౌతుకమాస్థయు భక్తిగౌరవా
ళిని గొని యుంట నెల్లరు భళీ యితఁడే తగురాజటంచు బి
ట్టనుకొని రెల్లచోటులను నాఘనసింధునృపాలచంద్రునిన్. 54

ఆసభయైనవెన్క వినయాన విదేహనృపాలుఁ జేరి తా
నాసమయాన నంతిపురినాయితముం బొనరించుచున్న యే
వోసభలోని కొక్కపరి నోపిక రమ్మని సింధురాజనన్
దాసచివుండు వెంటఁజనఁ దత్సభఁ జేరె నతండు వేడుకన్. 55

గీ. ప్రభువు మంత్రిని నాయకవ్రాతములను
నంతిపురికాంత లెఱుగని యట్టిరీతి
వారివచనంబులెల్ల నవ్వారిఁ దెలియ
వారుకోరునటులె జేర్చె వారిమంత్రి. 56

మ. అచటన్ పిలుగు చోటఁ జాటున నమాత్యశ్రేష్ఠునిన్ దత్ప్రజాని
నిచయంబున్ విభుఁగూర్చుచుండునటు నిర్ణీతంబు నామంత్రిచే
యుచు నిశ్శ్రేయసఁ జేర నవ్విభువు సత్యప్రాంతఁ బిల్పింప నా
వచనంబుల్విని భూషితాంగియయి యాపద్మాక్షి యేతెంచుచున్.

మ. ఋతుపాళిఁ గుసుమాకరంబుపగిది న్వ్రత్తాళి నశ్వత్థమ
ట్లు తురంగంబుల శక్రవారువముల్ మోదాఢ్యగాఁ బూతగా
నుతిపాత్రామలగా నెసంగియచ్చటన్ గూర్చున్న కాంతాళి దృ
ష్టితతిన్ వెల్గెడు భూరిరూపగుణరాశిన్ రాణి నిశ్శ్రేయసన్. 58

సీ. దోషరాజశిలీలఁ దోసిరాజనులీల
నెఱినొప్పు నునుసోఁగ కురులతోడ
పంకజారిని నెంచి వంకలుంచి హసించు
సదమల మోహనాస్యంబు తోడ
పటుతమోహారహారాచు భవ్యమోదదము నొ
చంద్రికఁ గేరు హాసంబు తోడ
నెట్టివారలనైన నిట్టిమార్పగనైన
స్నిగ్ధకోమలశీత దృష్టితోడ

గీ. చూడఁజూడంగ నింకను జూచుకోర్కె
దరికిఁజేరంగఁ గుగుణాళితలఁగుకోర్కె
భాషవినఁగ నుచ్చైర్గతి పరలుకోర్కె
పొడమి నేఱమిరాఱగఁ జేయు మూర్తితోడ. 59

కం. శివకేశవవిధిరాజ్ఞులు
భువినేకత నామెరూపమును గొని రస స
ర్వవిమలగుణముల వెలయుచు
యువతీలోకంబునందు నొప్పెడు నాపెన్. 60

శా. ఆకర్ణాయతలోచనంబు నవసంఖ్యంబోలుకర్ణంబు శో
భాకీర్ణంబయి నువ్వుపువ్వనగు రమ్యంబైనదౌ నాస యా
యాకాశంబును బోలు నెన్నడుము సొంపైనట్టి పాలిండ్లు వ
ల్లీకాండంబులనేలు బాహువులు నోలిం గ్రాలు నిశ్శ్రేయసన్. 61

మ. కని యాకన్నియ భక్తిమీర నటునాకంజాస్యపాదాల చెం
తను సంప్రీతినమస్కృతుల్ సలిపి యేతద్ధ్యాననిర్మగ్నయా
చు నిమేషంబట్టి దేహమున్మఱవఁ జుంచుం దివ్వి యారాణియా
పెనుబైకెత్తి శిరంబుమూర్కొని మహాపేక్షన్ దరింజేయుచున్. 62

గీ. జలజజంబీరజంబాల జాలములును
గగనగోస్తనీగాంగేయ గజములోడు
నానన కుశాంగరాగ దృగావళియును
నుదరవాగ్దేహగమనమ్ము లొప్పుదాని. 63

సీ. మందాకినీఫేన మందహాసముదాని
గిండ్లనుమీరు పాలిండ్లదాని
స్వర్ణకాంతులమీఱు భవ్యదేహముదాని
వజ్రాలుమీఱు పల్వరుసదాని
కాలసర్పముఁబోలు ఘనవేణి కలదాని
కంబునుంగెల్చు కంఠంబుదాని
స్మరధనస్సునునొంపఁ జాలుకన్బొమదాని
మీలనుబోలు నేత్రాలదాని

గీ. కంజశోభనుమీఱు వక్త్రంబుదాని
బింబమున్బోలు ప్రవిమలోష్ఠంబుదాని
వరమిళిందపంక్తిగొను ముంగురులదాని
గేయమైయొప్పుసొబగునఁ గేముదాని. 64

గీ. అతులకమనీయము విమలహర్షదంబు
నిరతమందస్మితవికాస సురుచిరంబు
భాగజితసుధాధామబింబంబునైన
యతులవికసిత కోమలాస్యంబుదాని. 65

కం. రూపమునానందంబును
నేపగుసుగుణాళిఁ జేర్చియిటులీకన్యా
రూపము నవ్విధిసేయుట
దోఁపించుచునున్న మూర్తిదోఁచెడునావిన్. 66

ఉ. అన్నిటఁ దన్నుబోలు రుచిరాంగకముల్ మృదుహాసచంద్రికల్
దిన్నని భాషలున్గలుగు లేమను, యౌవనరాశిఁ గాంచి యే
తెన్నున నాపినన్నలక తేఁకువఁ బొంగెడు ప్రేమమీఱ నా
మెన్ని మొసంబుకౌఁగిలిని మేలుగఁ జేరిచి రాణి పిమ్మటన్. 67

మ. మృదువాక్యంబుల నిట్లువల్కె నటఁ దానేమేమిభాషించునో
తుదకవ్వారిప్రయత్నమే ఫలమునందుం బొందునో యంచుఁ దా
మెదభావించుచు నూపిరిన్విడువ కెంతేనాయకుల్పాడఁ ద
త్సుదతీరత్నము నేఁటిమీఱు ఘనసంతోషాన నాలింపగన్. 68

మ. సకలంబౌశుభమంగళంబులను నిష్టంబట్లుచేకూరుచున్
ప్రకటప్రాభవశోభలంగనుచు సంవర్ధిల్ల నాశీర్వదిం
చి కడున్ బ్రేమను ముద్దువెట్టుచట నాసీమంతినిన్ దన్ను నా
డకునాహ్వానముసేయు కారణము వింటన్ గోర నాకన్యయున్. 69

ఉ. "మీమహనీయవర్తనము మీమృదుభాషలు మీలసద్గుణ
స్తోమముఁ గూర్చి వించు మిముఁజూచి సమస్తకృతిఁ జేసినంత శో
భాయమహాను జన్మమును హంఘను మిమ్మిటఁ బిల్వనంపితిన్
మీమహీశానుకంపను క్షమింపఁగఁగోరెద నాశిశుక్రియన్. 70

ఉ. నాకములోనివారలకునైన నలభ్యములైన సద్గుణా
నీకము శోడ గాంచెడు ననింద్యచరిత్రలు మీకులాన్వికై
వ్యాకులమంది శంకఁగొనువారల చిత్తములుక్కడుండఁగాఁ
జీకటినిండియుండు గుహసీమలటంచుఁ దలంతు నెంతయున్. 71

ఉ. అప్పరమేష్ఠినైనను మహాద్భుతమందఁగఁ జేయునట్టిదై
యొప్పెడి మీప్రవర్తనమె యుత్తమరీతినిఁ ద్వత్కులోన్నతిన్
జెప్పకచెప్పుచుండఁగ, సఖీ! యనుమానమదెట్లుగల్గెనో
యప్పురివారు మెచ్చునటు లన్యులఁ కెవ్వరునుందురే భువిన్. 72

చం. అతులితశాంతిదాంతుల, సమంచితలీలల, నాగమాంతబో
ధితసుపథంబునన్ మెలఁగి దివ్యయశంబునఁ గ్రాలుచున్న యు
న్నతులను మిమ్ము యీగతి నొనర్చిన నన్యులు నిల్చుటెట్లు ల
బ్బ! తలుపుచెక్కలే తినెడువారల కెప్పుడ మొక్క లెక్కయే. 73

మ. తలలో నాల్కగ నెల్లెడన్ మెలఁగి యుద్యత్కీర్తి నార్జించు వే
ళల, మీబిడ్డలఁ జేతులార విడుకాలంబందు, సంపత్సుఖం
బులవీడ్కొంచు వనంబుఁ జేరుతఱి నిష్ఠన్ మిమ్ము రమ్మంచు నిం
దులకున్ బిల్చినవేళ మాఱని భవన్మోదంబె చిత్రంబగున్. 74

మ. వనితాదర్శకురాలుగాఁగ మిగులన్ భాసిల్లు మీచెంత దా
సిసిగా వర్తిలనెంతయేని మదివాంఛింతున్ సదా కాని మ
ద్భ్యాసరీతిన్గనలేని మూర్ఖజనులందున్ రాణిగామాత్ర ముం
టను వాంఛింపను సుమ్ము సుంతయిన, నానందప్రపూర్ణాత్మికా. 75

ఉ. చూచినయంతమాత్రమున శుద్ధవిరోధిసనైన నెట్టిసం
కోచములేని స్వచ్ఛమగుసూరిమిఁ గ్రాలఁగఁ జేయఁజాలు మీ
దాచిఱునవ్వు లజ్జనులయందున నేటికి రిత్తవోయెనో
శోచదు నాకు, నాదుమతిదోషముచేతనె యేమొ! మాతరో! 76

మ. అనగన్ జిత్రము జేసిచిత్రము వదియాక్షిన్ గనుంగొన్న దా
ది సితాంతామితభక్తినామహితునిన్ దేవుండుగాఁ బూజసే
యనె తోచున్ మది నన్యభావమిసుమంతైనన్ గనంబోన నీ
జనమెంతెంతగ యత్నముల్సలిపినన్, సర్వేశు డేమెంచెనో! 77

ఉ. దృష్టులమిమ్ముఁ జూడకయు నిద్ధతరంబును సజ్జనాళిసం
తుష్టికరమ్మునై వెలయు తోరపువర్తనమీది వింట నే
కష్టమునొందయైన మిముఁ గాంచి నమస్కృతిఁ జేసి జన్మమున్
శిష్టముఁ జేయు నిష్టమతి శ్రేష్ఠతఁ గల్గు నవార్యమైకడున్. 78

మ. అనిభాషించు వధూవతంసమును బ్రేమారూఢిమై బుజ్జగిం
చి, నయంబొప్పఁగ నాయమేయసుగుణశ్రీయైన నిశ్శ్రేయసా
వనితారత్నము మాఱువల్కఁదొడఁగెన్ వాక్యంబు వాక్యంబునం
దును నేమాడునొ ఈమెయంచు జనులందున్ గాంక్షనాలింపఁగన్.

చం. "బాలికలాటచేతను బ్రపంచప్రదీపు నెఱుంగనేరకే
లీలవచింతు, వేషునుడు లీలమెయిం దమతెల్విన్నుతిం
గ్రాలుట తెల్విలేమినివగంగొనుచుంటయు నుండునే? నవుం
జేలవ్యథాళిఁగుందెడు నొకించుకమార్చెడి శక్తియున్న చోఁ! 80

ఉ. మజ్జనపరికారమును మానసమందు నెఱుంగలేని యే
తజ్జనమట్లు శంకను వితాకును బొందుట వింతయంచు నే
సజ్జనుఁడున్ వచించునొకో! సత్కులసంభవుఁడే నృపుండుగా
నిజ్జగమందు గోరఁడొకో యెవ్వడుగాని; తలంచిచూడుమా! 81

చం. జనమెటుకోరుచున్న నటుసల్పినమాత్రముచేతఁ గాని నా
మనము నెఱుంగఁగోరుచు సమస్తముఁదెల్పినపై ననుజ్ఞని
చ్చిన విషయానఁ గాని నృపుఁజిన్నగనెంచకు! మాపరిపాపియం
బుగుఁ బరిపాలనామృదులమున్ వెలయించుఁ దదీయకార్యముల్.

మ. పరసైన్యప్రవిదారణంబునను, శుంభన్నీతిసంరక్షణా
భిరతిన్ దీవ్రతతేజకత్వమయినన్ విశ్వాసులాస్యప్రజల్
సరసంబొప్పసమంజసంబయినవౌ శంకల్ కడున్ సల్పు చో
విరసుండట్టులు వీర్యమొప్ప నణపన్ విఖ్యాతియే, యెంచుమా. 83

కం. సత్యంబును దూరదృష్టుల
నత్యంతము నరయుదేనియాత్మం దోఁచున్.
గత్యంతరమిక లేకా
శ్రుత్యంతపథానువర్తి సుపథమె సరిగన్. 84

ఉ. అన్నిటనామహామహుఁను స్వాంతము మెచ్చిన కన్నె నెన్నుచుం
గొన్నదిగాని తజ్జనులకోరిక బిడ్డల నన్నువీడి యీ
తెన్నునఁ దత్ప్రజాతతులు తీరుగఁ గోరిన సత్కులోద్భవన్
మిన్నకకొంటగాని కడుమేలును బిట్టు సమంజసంబగున్. 85

ఉ. సద్గుణపాళికిక్కయయి సంస్తుతసర్వసులక్షణాఢ్యుడై
సద్గతిదాయకుండునయి శౌర్యపరాక్రమరమ్యతాదిభా
స్వద్గుణమండితుండుగు యశంబునుబొందిన మేటిఁ జేసు చే
త్వద్గుణపీయపుణ్యుమని తప్పక నమ్ముము! శంక లేటికిన్. 86

శా. త్వత్సంపత్సుఖశోభలంగనుచు మత్స్వాంతంబునం దెంతయే
నుత్సాహంబును బొందుచుండుదునుగా కోయమ్మ! యీర్ష్యాదులన్
ద్వత్సౌఖ్యాదులకంతరాయము నేభావింప, నెంతేనియున్
మత్సేవాదులఁ దృప్తిఁ జేసెదనుఁ జుమ్మా. మిమ్ము ముమ్మాటికిన్.

చం. అతివగ జన్మమందిన మహత్తరపుణ్యను మీఱ నామహో
న్నతుని గృహంబుఁ జేరుచు ననారతసౌఖ్యములందుమమ్మ, భూ
పతిమదికెక్క నీవుభయవంశపవిత్రిగ వర్ణనీయ స
త్సతిగ కృపాప్రపూర్ణగ విశాలమనఃపరకీర్తనీయగన్." 88

మ. ఇటులేమేమొ వచించుచున్న తఱి నయ్యేక్కంబ్రివేశించుచున్
భటుఁడొక్కఁడు "నృపాలచిహ్నములతో భాసిల్లు నవ్యాగతుం
డట ద్వారమ్మున వేచియుండె"నన నాఁడాశ్చర్యముం బొంది య
చ్చటికిన్వారినిఁ దేఱ సంజ్ఞలననుజ్ఞం జేయ వాఁడేగినన్. 89

మ. పులిపైపుట్రగనింక నేదొ ముసిగెంబోయంచు నచ్చోటివా
రలు సాశ్చర్యభయాన్వితులై కనఁగఁ దద్రాజ్ఞీముఖాబ్జాననా
వళి విఘ్నమ్మును బొంది యాగి యెచటన్ బ్రొక్కన్ జనంబున్న జా
డలకున్ వింతను బొంది రంతిపురియాటల్ సంశయస్వాంతలై. 90

మణిమాల:— శ్రీమద్రఘువంశక్షీరాంబుధిసోమా!
సోమాంకముఖోద్యత్సూరిస్తుతనామా!
భూమీతనయాసంపూజితగుణధామా!
జీమూతసమానస్ఫీతాంగలలామా!

మాలిని:— సరసిజనిభహస్తా సర్వలోకప్రశస్తా
స్ఫురదురుతరకీర్తీ సుందరోదారమూర్తీ
ఖరకరశశినేత్రా గాఢజీమూతగాత్రా
స్మరహరనుతచారా మైథిలీచిత్తచోరా.

తోటకము:— వినయాదిసలద్గుణబృందవరా!
దిననాథకులాంబుధిదీప్తికరా
మునిశేఖరహృత్స్ఫుటమోదకరా
ఘనగాత్రరమాజితకంబుధరా!

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధారేయ
కౌండిన్యగోత్రపవిత్ర ముత్యవంశపయః
పారావార రాకాసుధానిలయ కామేశ్వ
రాంబాసూర్యనారాయణార్యతనయ
విబుధవిధేయ శ్రీ సుబ్బరాయ
ప్రణీతంబైన నిశ్శ్రేయ
సానందకావ్య మందలి
తృతీయాశ్వాసము

సంపూర్ణము.

# నిశ్శ్రేయసానందము.

## పంచమాశ్వాసము.

శ్రీ జనకసుతాహృదయ స
రోజాతజలరుహమిత్రరూక్షకటాక్షో
త్తేజోజితరిపురాజీ
రాజీవవిశాలనేత్ర ప్రకటచరిత్రా. 1

కం. వచ్చెడిసంగతులను గన
నచ్చెరువుగ నచటివారలందఱు మిగులం
జొచ్చెంబులేని యాత్రిం
బచ్చుపడఁగ, నెదురుచూచు నాసమయమునన్. 2

ఉ. అంతట నేగుదెంచె నటకంగభవప్రతిమానరూపుఁ డా
క్కాంతవయస్సుచెల్లిన యహీనబలాఢ్యుఁడు రాజనీతివిజ్ఞుఁ
డెంతకుబల్చి తేఁడు తనచేతనవాసనమందుఁ జేర్చి య
త్యంతము గౌరవానఁ గుశలాదులఁ బృచ్ఛను సేయు నాతఁడున్. 3

కం. హర్షంబెసఁగఁగ గోసల
వర్షాధిపుఁ గాఁగఁ దన్నుఁ బలికికొని సమా
కర్షించెనచటివారిని
శీర్షముఁదనవైపు వారుచేరిచివినఁగన్. 4

శా. "ఈరీతిందమరీరహస్యసభయందేపారుటాలించియున్
నేరాకుండనిలంగలేనికతమున్విన్పింతు, భూనాయకా!
ఘోర వ్యాకులమిచ్చుమచ్చరితమీకుందెల్ప మీకున్న యా
స్వారానందము భంగమొందునను చున్ శంకింతు నాత్మన్ గడున్".

కం. అసిగాంభీర్యము దైన్యము
నను తాపముగదురఁబల్కె నయ్యానరపతిదృ
ష్టినినిష్టహృత్పష్టసూచనఁ
గనితనకథనిట్లుబలుకఁగాఁజనె వడిగన్. 6

చం. "అతులితసౌమ్యలక్షణసమన్వితయై విలసిల్లునట్టిస
త్సుతఁగనినామతోంటిసతి తూర్ణముగా దివికేగఁ దానుత
త్సుతనొకతూరియుందిరిగిచూడకె, తత్సుతఁజూచిపండిత
ప్రతతిమహోన్నతస్థితిని భాసిలునంచునచించితెంతయున్. 7

ఉ. ఆత్తసుఖేవియోగమునఁ దద్దయుఁగుంద్రియొకబ్దమేగఁగా
బిత్తరినొర్తుబెండ్లిఁగొని పిమ్మట నాల్గుసమల్ సుఖంబుగా
నత్తటిఁబుచ్చితిన్, బిదపనైనది యేమని తెల్పువాఁడ! నా
చిత్తము తల్లడిల్లునది చెప్పఁగఁబూనినయంత నెంతయున్. 8

ఉ. ఏనొక యేడునాళ్ళసుమి యేగితిఁగానకువేటఁగోరి! యా
లోననెనాదుపుత్రిపరలోకముఁజేయుటవింటి నామెమో
మైననుఁజూడనోచికొననైతిని, నాఁడటఁపండితావళుల్
దానినిఁగూర్చి పల్కినవిధంబెటుబోయెనొ! వింతయయ్యెడిన్. 9

కం. జననిని బోలినసుతుఁడును
జనకునిబోలిన సుగాత్రిచయ్యననెంతే
ఘనుతాటవించునామెయు
ననుసరిగాఁబోలియుంట సమ్మతిబుధులన్. 10

ఉ. ఇర్వదియైనువత్సరములెట్లొగతించె నసంతరంబు. నే
నుర్విఁవసించియుంటిని తదుత్తమపుత్రికవీడియిట్లు, నా
గర్వము సర్వమున్మడిసె, ఁగొంతయునాలుగు వత్సరాలకున్
బూర్వము లోకమున్విడిచిపోయె గృహస్థలిశూన్యమాగతిన్. 11

కం. తదీరితి నెతలమునిఁగెడి
మద్రాజ్యమునందు నపుడు మసలఁదొడఁగె భా
స్వద్రచన వచనములఁ జం
చద్రీతి జనాళినేలు బటిగొనుకఁ డెలమిన్. 12

ఉ. పువ్వులబ కాసిలీలసరిపోలెడిరూపము దేవపూజ్యనిన్
నప్పుఁమతిప్రభానమును నల్వగునానర యోగిమాళి నా
యువ్వగపుత్రిచావమియు పోయిగనొక్కటనుంటయున్ గడున్
మువ్వపుఁబ్రిసుఁబెల్పి కడుసమ్ముల నమ్మఁగఁజేసిలీలగన్. 13

ఉ. మంత్రులతెల్వినానలఁగ్రమ్మంబుగఁగాంచఁగనయ్యె నెంతయోఁ
దంత్రమునన్ ద్వితీయ సతితంత్రతఁ గానను బాంవేయు నా
మంత్రము, నాటికోటయిడుమల్ పడి తేల్చకొనంగనయ్యె మా
మంత్రులు నేను నాదుసుకుమారి చరించిన కాననంబులన్. 14

ఉ. త్యాజ్యమెనన్నుఁబోలిన యధఃపతి త్రాఁగణికంచు మంత్రికిన్
రాజ్యమునొప్పగించి సుతరంజిలుచోటునుఁగూర్చి యెందటే
పూజ్యులఁజేరి యారయుచు బోటినిగాంచుటకో మేనుజంతుసం
భోజ్యముఁగావసిన్ విడుటో పోలునటంచు వనాలఁగ్రుమ్మఱన్. 15

మ. చిరకాలంబుతపోగ్నిఁ గాలునల కాశ్మీరప్రభుండాయమన్
గరుణం జేరిచి పెంచి విద్యలిడి తాఁగల్యాణముల్ జేయుటన్
సరవిన్ వించుఁ దదీయ మానిచరణాబ్జాతంబులన్ జేరి మీ
చరితంబెల్ల దదీయమానసకడ నిచ్చున్వింటి, రాజోత్తమా! 16

మ. మద్గృహామందెయుండినఁ గుమారికకంతటి సద్యశంబు భా
స్వద్గతియున్ సువిద్యలును బ్రాపును బాల్పడియుండునొక్కొ త
త్సద్గుణ నిత్యసేవఫలితంబుగ నయ్యవి కల్గెఁగాని! యే
తద్గుణదర్శనానఁగద దక్కెను నాకసువుల్ కుమారియున్! 17

మ. రానని యెంత పల్కినను బ్రార్థనఁజేయుచు నామహాత్ముని
న్నేనిటుతోడి తెచ్చియిటునిల్పితి మీపురమందిరంబునన్
గానఁగనిండుమత్సుతను గన్నులపండువుగాఁగనొక్క మా
ఱో నరనాథ"! యంచుఁగడునార్చుచుఁ బల్కుచు తేనిఁగాంచుమన్.

ఉ. సత్కృపమై మదీయసుతచావమిఁదెల్పి యెటుల్లొమేమటన్
దత్కథలన్ బయల్పరుపఁ దద్దయువీలును తెల్పినట్టియే
తత్కమనీయ యోగి, భళి! త్వత్సచివాగ్రిణిఁ గోలియుండెడిన్
దత్కళలన్నిటన్ గనఁనతండని యేకడుఁ జూచుమన్మతిన్." 91

కం. తచ్చిత్రకథనువిను జను
లచ్చోనాశ్చర్యశోకహర్షాధ్యులుఁగా
నచ్చటికిరాణిఁదెమ్మని
యచ్చటనానందభూపుఁ డానతినిచ్చెన్. 20

గీ. దైవికమ్ముగ నట తటస్థమ్ములయిన
చిత్రసంఘటనలకు నచ్చెరువునంది
కరము నానందబుద్ధిసాగరులు దైన
శక్తి యద్వితీయమగుటఁ జాలఁ దలఁచి 21

కం. ఎన్నన్నిమార్గ రిమ్మని
యున్నను దనతోడరాని యామునిపురికిన్
దిన్నగవిచ్చేయుట విని
యన్నరపతి యులరుచు సచివాప్తులతోడన్. 22

మ. చని యా రాజమునీంద్రమాళికి నమస్కారంబుగావించి యు
ర్వ్యసలన్ బేర్మినొసర్చి యంతిపురికర్హంబైన మర్యాదఁ దో
డ్కొనితెచ్చెన్ గని ప్రీతి నెల్లరును నక్కంగాంచు కంజాళిరీ
తిని యుత్ఫుల్లమనస్కులై నతిముదోద్రేకంబునం జేయఁగన్ .23

కం. ఆయుత్సవసమయంబున
నాయూరిజనంబులెల్ల నంతిపురి మహా
మేయముదంబునఁ జేరఁగ
నేయెడఁ గ్రిక్కిరిసియుండె నెంతయు నదియున్. 24

శా. ఆసిశ్శ్రియసమూర్తి గొన్న వినయం బాయున్నరూపంబుతోఁ
దా నేతెంచుచుఁ గోసలాధిపునకున్ దద్యోగికిన్ మ్రొక్క నా
భూనాథుండు కవుంగిలించి శిరమున్మూర్కొంచు దేహంబునే
త్రానెంతే మఱచెన్ క్షణంబు ఘనమోదంబందిరం దెల్లరున్. 25

కం. జనకుఁడు సుతయును రూపం
బున నొకఁడేరీతినుంటఁ బొల్చుచు వారల్
విసినట్టికథనుఁ దలఁచుచు
మునుపటి దమచెయ్వులకటఁ బొగులుచు మదులన్. 26

కం. నిష్కారణముగ నేత
న్నిష్కల్మషపుత్రులను వసిన్ విడ నెంతే
ముష్కరగతి ననియుంటకు
శుష్కంబుగ నష్ట వగపఁ జొచ్చిరి వారల్. 27

కం. నిర్భరవిపులానందా
విర్భావముగాఁగ వారు వెనుకను దత్సం
దర్భంబెఱుఁగక యాడిన
యర్భకుల కాత్మ నడలఁదొడఁగిరి మిగులన్. 28

మ. తమరాజ్ఞీమణి సద్గుణంబుల మహోద్యద్రూపమందున్ జరి
త్రమునందున్ యశమందె కాక విలసద్వంశంబునన్ మిన్నయౌ
ట మహానందమునొంది యెల్లరును నిష్టంబొప్పగా నామెపా
దములన్ వ్రాలి క్షమాపణంబడిగి రాత్రంబొప్ప దోషాళికిన్. 29

కం. ఆనందనృపుని సచివుం
డానందముఁ బట్టలేక యుఁదటిలోనన్
దాసిజులపలుక దొడఁగెను
ధీసిద్ధియుత యెల్లవారుఁ దృప్తి వహింపన్. 30

ఉ. ఆవిధి కోసలన్ వివిధయత్నము లామె జనప్రికారమై
ట్లైవెలిసేయ శ్రద్ధవహియించుచు నిట్లిటుఁబైనివ్రాలు నా
యావివిధవ్యథాహతుల కష్టపుమార్గము లెంచి మంచు నే
నీవిధినిందునందు వ్యథనేమియుఁదోచక మ్రగ్గితిన్ గడున్. 31

ఉ. మానవసాధ్యయత్నముల మానక యున్నియునిల్పియున్ విచి
త్రానఁ బయింబయింబడు వ్యథాహతులన్నిటి నాపలేక దై
వాననె భారముంచి సలుపందొరకొంటి సమగ్రమైన కా
ర్యాన విధానలోపము రవంతయుఁ గల్గనీక యిచ్చటన్. 32

ఉ. తావిని బట్టి పూవులవిధంబునుఁ దావునెఱుంగఁజాలు న
ట్లే విమలంబుగా నెసఁగు నీమెమహోత్తమవర్తనంబు స
ద్భావము నీమెసత్కులమవారితలీలలఁ దెల్పుచున్న నే
నేవిధిఁ దెల్పినన్ విడువ రీయనుమానము నీప్రజాతతుల్. 33

ఉ. వారలకోర్కె- రీతిగనె వారికిఁ బిడ్డలనప్పగింప భూ
జానుఁడు నట్లెయంటయును దత్సుతుల న్వధియింపఁగోరు న
వ్వారల మందలించి వెలివారల నీడుదు నంచుఁ గొంచు న
వ్వారల నీనృపాలునకుఁ బంపెనుతింపఁగఁ బెంపఁగానిటన్. 34

ఉ. బిడ్డలులేనిహేతువున బిట్టును గుందుచునుంటచేత నీ
బిడ్డలఁగన్న బిడ్డలను ప్రేమను బెంచుచు సర్వవిద్యలన్
దొడ్డతనంబునన్ శిశులఁ దోరముగా యశమందఁజేసె నా
బిడ్డలు నీనృపాలు నెడఁ బేర్మిపొసంగ నెసంగి రెంతయున్. 35

కం. రూపమునఁ గలదు తనసతి
కాపెను నొకయింతపోల్కి యని నృపుడనఁగా
నాపెనతఁడు కోరెననుచు
నీపెను జతసంబుఁ జేసి రీనరముఖ్యుల్. 36

శా. తద్వాత్సంబున వారలున్నతటి సత్యంబున్ బ్రజారాజికిన్
వేద్యంబుంబొనరించు కోరికను గావింపంగ నేనీసభన్
జోద్యంబొప్ప సమస్తసంగతులు నిచ్చో వెల్లడిం బొందుచున్
మద్యాత్మాళికిఁ బూర్ణసత్ఫలము సంపాదించె నీరీతిగన్. 37

కం. ఆలోన నేను మిగులన్
నాలోనను వెతఁలబడి రయొనర్చిన కృషి ని
వ్వేళను మీకెఱిఁగించుట
పోలునని యెత్తోఁచు నాకుఁ బూర్ణముగాగన్. 38

చం. క్రిమమునఁ గోసలన్ మఱువఁగాఁబడి యుండినయట్టి రాణి జ
న్మముకథ నెల్ల నెల్లరఘునవ్యథమైవెలిసేసి తత్సమ
స్తముఁ బ్రిభువక్యదృష్టులకు సాగఁగఁజేసితి నందుఁగల్గుస
త్యము నిజమౌనటంచు నొకయాశను నెమ్మదిఁబూని యెంతయున్.

ఉ. అంపలిసత్యమాత్మఁగని సంతసె తేఁడు విచారమంది కా
నం దిసగఁ దోడంగె లలనామణికై యని వించుఁ గుందుచుం
డెందమునందు తెనిఁగను శేవ నెఱుంగఁగఁగోరి వీరులన్
గొందఱఁబంపి యుండితి నకుంతచరిత్రిని దోడితేరఁగన్. 39

ఉ. ఎచ్చట నానృపాలు విఘమే కనలేమి నికెట్టిరీతిగా
పొచ్చములేక యీచరిత పూర్ణతనొందునటంచు నెంచుచున్.
రిచ్చనుజెంది నేను నలుకేలనలఁ జూచుచునుంటిగాని యీ
మచ్చున దైవమీకథను మంజులరీతిని మార్చె, జూడుడీ! 40

కం. ఏనీతేనిం బూని యె
క్కేసిన్ బంధించి యుంచునే మొ యనుచు న
మ్మానిత సచివ్వృందు పొంచుచుఁ
బైసింబడె మొన్నమున్నుఁ బట్టుకొనంగన్. 41

ఉ. సుస్తుతమైన యీసతి నచోవిధియుక్ సుగుణప్రకాండమున్
శస్త్రసతీత్వధర్మమును సాయమెలుగా నిట నేనొనర్చినీ
ప్రస్తుతయత్నమంతయుఁ బరాత్పరుఁడే ఫలియింపజేయునన్
నిస్తులధైర్యమే యిటులు నిల్వఁగజేసె ననున్ సభాస్థలిన్. 42

చం. ఎవఁడతిధర్మవర్తనుఁడు సిద్ధచరిత్రుఁడునై యెసంగు నా
పవిమలుఁడైన వానికిల బాసటయై నిలుచుండుఁ గోరిభూ
తవితతి కాలమున్, శిలలు దక్కిన జంతుగణంబుఁ దోల్గి రా
ఘవునకు వానరుల్ శిలలుఁ గంధియు బాసటయైన కైవడిన్ 43

మ. ఒకటన్ ధర్మపథానువర్తనుని కే యుర్విన్ వ్యథల్ గల్గుచుం
టకు మూలంబు శివుండుఁ దత్సముఁడు నెన్నన్ న్నెత్తరే కాని యే
రికి శక్యంబగుఁ దెల్ప? నావ్యథలు నేకేప్రసన్ దదుత్తీర్ణునిన్
వికలంబుఁ బొనరింప వాతఁడెపుడున్ విజ్ఞానియై యుంటచేన్. 44

కం. తద్విత్రింబలుకుచు మో
దోద్రేకముచేత నిలిచె నొక సరి యతడే
తద్రాజవరుల జనముల
ముద్రితచిత్రంబులో లెఁ బొడగనుచునటన్. 45

శా. ఆత్మానందమునొందు నాసమయమునం దానందుఁడాకోసలా
మాత్యాళిన్ బిలిపింప వారలు నిజక్ష్మానాధునిన్ దత్కథా
సత్యంబున్ గని వింతనంది రమలస్వాంతుండు తద్యోగితా
నత్యంతంబు సమర్చనప్రసల కేల్మాయన్ గడున్ మెచ్చఁగన్. 46

శా. త్యాజ్యాంబేయుకనంచుఁ గోసలవిభుండవ్వేళ నవ్వారితో
రాజ్యంబెల్లఁ దదీయపుత్రికకుఁ దోరంబొప్పగా నిచ్చి తాఁ
బూజ్యుండౌ నలయోగిపుంగవునితోఁ బోఁబోవునవ్వేళ యం
దీజ్యాసుండలి యేదివంబయిన యల్లే వారుసానందులై. 47

ఉ. కోల్పడిపోతిమంచు ననుకొన్న శిశుల్ ప్రతిభాఢ్యు లద్వయా
నల్పకళాఢ్యులై తమను నల్వ్యగఁ జేకుటచేత సిద్ధసం
కల్పుఁడు యోగిచంద్రుఁడు ప్రగాఢదయన్ దయచేయుటన్ మదిన్
దెల్పఁగరాని మోదమునఁ దేగిరి రాణియు రాజు నెల్లరున్. 48

చం. అకలుషు డానృపుండు తనయాపలముంగని యామెఁ గాంచఁ బ్రే
మకలనఁ గోరె భక్తిని గుమారియుఁ దన్నృపుఁ జూడఁగోరె నీ
ప్రకృతిరహస్యమారయఁ గరమ్మును నేరమి నెంచిరేదో నా
యకు లితరమ్మటంచు జన మచ్చట నెంచఁగఁ జొచ్చి రెంతయున్. 49

మ. నరుకన్నన్ బ్రబలంపుశక్తి నసుపున్ నల్వొప్పగా నెల్లెడన్
నరునిన్, నిత్యము నీనిజంబు గుజ్జైనం గూడ నన్యున్ దనున్
నరవిన్ నేతలుగాఁ దలంచు నరుఁ డీసత్యంబు స్వాంతాన వి
స్మరణంబున్ బొనరించుకొంటగద సంబద్ధుండగున్ హీనుఁడై. 50

మ. దురహంకారము లేక తృష్ణమెయి నెంచుంగూలఁ గాత్మచ్యుతిన్
బొరయంబోవ కమేయవర్తనసతింబున్ నిల్చి యన్యుల్ నిరం
తరముం దన్గని వారివర్తనల దిద్దంగల్గురీతిన్ ధరన్
జరియింపంగలవాఁడె జ్ఞానియని యెంచం జొచ్చి రందెల్లరున్. 51

శా. ఆనాఁడట్లు క్రమక్రమంబుగ నంఖ్యంబౌచు మోదప్రదం
బౌ నాసంఘటనాదు లచ్చట నసంఖ్యాకంబుగాఁ గల్గుటన్
గానంజేరరి గాని యుందఱట లెక్కన్ మీఱి యానాఁడు గా
కేనాఁడైన జనంబు లంతిపురిలో నీరీతిఁగాఁ జేరిరే! 52

ఉ. ఆసమయంబునం దచటి యార్యజనంబటు యోగిచంద్రునిన్
గోసలరాజచంద్రుఁ గడుఁగూరిమిఁ గన్గొని మోదపూర్ణతన్
భాసిలె వాహినీంద్రుఁడు శుభప్రదు చంద్రునిఁగాంచినంత నా
శ్వాసముఁజెంది సమ్మదపు వర్ధిల పొంగి జెలంగు భంగిగన్. 53

ఉ. కూర్మి విదేహరాజ్యమునుఁ గోసలసింధుల నేలుకొమ్మటం
చర్మిలి బిడ్డఁడత్తతు లుదంచితలీల వచించినంత న
య్యార్మి[illegible]పూర్ణమహాశోదధిపూర్ణిమ నట్లు మోదపుం
బేర్మినిఁ బొంగి ఘోషిలె నమేయగతిం జనమెల్ల నచ్చటన్ 54

మ. "పరధర్మంబున దూర కెందు తనదై భాసిల్లు ధర్మంబునన్
స్థిరతన్ నిల్పుచుఁ దాను కాని తను హృచ్చిత్తంబులన్ దాను గా
నరయంబోక సమర్థ కార్యరచనంబం దన్యదుస్సాధశ
క్తిరహింపంగనువాఁడె ధీరుఁడట రక్తిన్ నేర్చి భాసిల్లుడీ!" 55

కం. అని యీ రాజర్షివరుఁడు
ఘనతరకరుణాంతరంగకమనీయుండై
జనముల కాశీర్వచనము
లనుపమలీలల నొసంగ నలరిరి వారల్. 56

చం. ఘనతఁ బ్రసాదనామమునఁ గ్రాలెడు నయ్యువరాజు నిర్మలా
ఖ్యను విలసిల్లు కన్నియను నంతట వారి పురమ్ము జేరఁగాఁ
గొనుసమయంబునన్ జనులకున్ గల మోదము వైభవోత్సవా
ళిని వివరింపఁగాఁ దరమె లేఖకుఁడెవ్వనికేని సుంతయున్! 57

మ. తీరనికష్టమంచుఁ బలుతెన్నుల బాధలనొందు తమ్మునా
తీరునఁ దేల్చువారల యదృష్టముఁ గూర్చి వచించువారు గం
భీరమతిప్రభావముల పేర్మికథన్ గడుఁజిత్రలీలలన్
మాఱిచినట్టి మంత్రి మతిమాన్యత మెచ్చెడువారు నైరటన్. 58

మ. నరనాథాగ్రణులందు నెంతయును నానందుండు, నిశ్శ్రేయసా
తరుణీరత్నము స్త్రీలయందును నమాత్యశ్రేష్ఠులన్ బుద్ధిసా
గరుఁ డాదర్శగతిన్ బ్రసాదుఁడట యుక్తప్రాయుఁడౌనంతకున్
బరిపాలించిరి వేదశిష్టవచనప్రాశస్త్య మింపొందగన్. 59

మ. అతిసేవ్యంబు యతిస్తుతంబునగు నాత్మానందమింపొందు ధీ
చతురుం డొక్కఁడె యీప్రపంచమునఁ గష్టంబుల్ కలంగింపకుం
డ తరింపంగలనేటియాచు ఘనతుష్టిన్ బొందఁగాఁ గల్గుఁ గా
కితరుల్ నిల్వఁగ నేర్తురే యచలులై యీసౌఖ్యదుఃఖాదులన్. 60

శా. ఇష్టంబైనను గష్టమైన మఱియెంతేస్పష్టమేమైన నే
క్లిష్టంబైన పరిస్థితింబడిన శంకింపండు విజ్ఞాని ఆ
శిష్టస్వీయసుధర్మవర్తనముమై జెన్నారగా నిల్చెడిన్
శిష్టుండై పరమేష్ఠి యిష్టమిడు తచ్చేష్టావళీహృష్టుఁడై. 61

మ. తమధర్మంబునువీడి యన్యమగు నాధర్మంబునన్ లాభలో
భమునన్ జొచ్చి పరస్పరేర్ష్యలను సర్వధ్వంసమున్ జేసి లో
కము దావాప్తికి సర్వమానవులు శంకల్ న్యూనతాధిక్యము
ఖ్యమహాభేదములందలంగి మనసౌ నన్యోన్యసఖ్యంబునన్. 62

చం. చివరికివాని దేజయము జిన్మయసౌఖ్యము బంచభూతస
త్త్వవిమలసేవయున్ యశము బ్రాభవరీతి. స్వధర్మమార్గమే
తవిలి చరించు నెవ్వఁడు వ్యధన్ సుఖరాజిఁ గలంగకుండ న
న్యవివిధ ధర్మరాజిని రవంతయు జూరక లాభవాంఛలన్. 63

శా. ఆదర్శంబితఁడే యటంచు సకలాశాంతస్థవిజ్ఞావళుల్
వాదంబుల్ వొనరింప భూరిగుణసంపన్నుండు ప్రజ్ఞాయితుం
డౌదార్యాన్వితుఁడున్ సువిక్రముఁడునై యత్యంతముగ్ దత్ప్రజన్
వేదోక్తంబగురీతిఁ బాలనము దైల్విన్ జేసె నాత్మోన్నతిన్. 64

ఉ. సార్థకనాముఁడై సకలసద్గుణధాముఁడునై యమేయుఁడై
వర్థిలు బుద్ధిసాగరుని ప్రజ్ఞయు సాయముకాఁ బ్రసాదుఁ డే
స్పర్ధలు లేసి శాంతిమెయిఁ బాలనఁజేయఁగఁగల్గె సౌఖ్యసం
వర్ధకలీల రాజ్యమును భ్రాభవమేర్పడ రక్తిఁ జొప్పడన్. 65

ఉ. శ్రీయుతమై యమేయము, నజేయమునై, ఘనగమ్యహార్మ్యశో
భాయుతమై, సమస్తవిభవస్ఫుటమై విబుధాళిసేవ్యమై
న్యాయమహాపథానుసరణస్ఫురణాఢ్యజనప్రకీర్ణమై
హాయినిఁగూర్చె వారిపుర మన్నిపురంబుల మేలుబంతిగన్. 66

సీ. రాగంబు శూన్యంబు రాగమేయున్నచో
ఘనభవబంధమోక్షంబునందె
క్రోధంబు శూన్యంబు, క్రోధమే యున్నచో
బహుజన్మకారణ స్వాంతమిందె
లోభంబు శూన్యంబు లోభమే యున్నచో
నార్జితశాంత శమానులందె
మోహంబు శూన్యంబు మోహమే యున్నచో
బ్రత్యగాత్మైక్య పథమునందె

గీ. మదము శూన్యంబు మదమున్న మమత నణప
మత్సరము శూన్య మదియున్న మలములందె
భువిని దివిఁ జేయు కీలకముఁ గను ఘనులు
నాపురములోనఁ బొల్చు బ్రాహ్మణులు మణులు. 67

ఉ. వేదములం బఠించుటయొ వేదమహార్థములన్ వచించుటో
భేదమతుల్ హరించి సుఖించుచులఁ దేలఁగఁ జాలు సంతతా
హ్లాదపథాన నెల్లరు మెలంగఁగ నేర్చు విధిన్ విధించుటో
కాదని స్వప్రయోజనపుఁ గాంక్ష స్వధర్మము వీడరాద్విజుల్. 68

కం. బాహుబలమునఁ జతుర్భుజు
నాహవమున గెలువఁ జాలు నపరిమిత బలో
త్సాహాన్వితులుఁ బరార్థ
స్నేహితులుఁ బ్రపంచహితులు నిఖిలనృపసుతుల్. 69

కం. తమబలవిద్యాసర్వ
స్వము నెల్లప్పుడును ధర్మసంస్థాపనఁగా
క మదమ్మునఁ దుచ్ఛపు స్వా
ర్థమునకు నై వాడర వటి రాజకుమారుల్. 70

చం. ఒకటను లేని వస్తువుల నొక్కటఁ దెచ్చుచు నొండుఁ గూడ మూ
లకుఁ బడకుండ, సుంత మిగులంగఁ గ్రయించియు శ్రీలనర్థనా
యకుఁ బురుడింపజాలియును న్యాయము దప్పరొకప్పుడైన న
త్యకలుషజీవులర్యజను లార్యమహాజనులన్నిభంగులన్. 71

కం. వినయము, భయమును, భక్తియు
ననుకూలతఁ, బ్రియము, క్షమయు నలర ద్విజులకో
పినకొలఁది సమితసాహా
య్యానిగూఢి మెలంగుచుందు రచ్చటిశూద్రుల్. 72

మ. తమరాజ్యంబున నేసమస్యయగునన్ దారొక్కన్నఁ దామన్యుల
ట్ల మహోదారగుణాలచు 'ఏమయిన' దంటల్ మాని తామందునన్
దమకర్తవ్యముఁ బూర్తిఁ జేసి తృటిలోఁ దన్ముక్తులై యెల్లరున్
విమతవ్యాళమ్ము గెందుటై యతులశాంతిన్ గాంతు రెల్లప్పుడున్.

మ. నడువంగష్టమటంచుఁగాని నడువంగష్టంబులో వానినిన్
విడువన్భావ్యమటంచుఁగాని విధులన్ వీడంగ నూహింప, కె
క్కుడుశ్రద్ధన్ విహితప్రకారముల సంకోచంబు లేకుండ నె
య్యెడ నెవ్వారికి వారు వర్తిలుదు రెంతే మోదమేపారఁగన్ 74

శా. తద్రాజ్యాంతరసీమలన్ వెలయు కాంతల్, సర్వవిద్యామలన్
భద్రోపాయములన్ బలాదులను రూపంబందునున్ మించి ని
ర్నిద్రప్రక్రియ భర్తలన్ శిశువులన్ స్నేహస్వభావానఁ జం
చద్రీతిన్ గడుసాయమారుదురు మహోత్సాహోన్నతిన్ బేర్చుచున్.

చ. తమతమజాతికిందగు విధంబగు ధర్మము నెల్ల వారు ని
త్యమును సమాచరించి, యిసుమంతపరస్పరభేదబుద్ధియున్
భ్రమయును న్యూనతాధికతరస్థితులు న్మద మీసు లేక శాం
తిమెయిని వర్తిలంగలరు తేకువమీఱఁ బ్రజాళి యచ్చటన్. 76

మ. నికవర్ణాశ్రమయోగ్యధర్మతతులన్ నిత్యప్రమోదంబుఁ గూ
ర్చ జనుల్ వర్తిలువారెకాని పరధర్మంబందు సంప్రీతి ని
ల్చి జడత్వంబున యుక్తమా తమక్రియాళిన్ హీనులై యున్నతిన్
బ్రజలందున్ గనఁగోరువారి నటఁ జూపన్ నేర మేరొక్కరిన్. 77

మ. పటుయంత్రమ్మున నెట్టిచోటుల సమర్పంబడ్డ భాగాదుల
చ్చటనేయుండక మారుచున్నయెడ నీమన్మాత్రమున్ యంత్రమె
ప్పటియట్లాడనిరీతి జాతులును నిల్పంబడ్డ ధర్మాళి నుం
డుటఁబోనాడి కలంగుచున్నయెడఁ గీడున్గల్గు వృత్తుల్సెడున్॥ 78

శా. ఆయంత్రమ్మున నేవిభాగమును నాయాస్థానరాజిన్ మహా
మేయంబౌ విలువన్ వహించునటు, నెమ్మిన్ సర్వజాతుల్ సదా
స్వీయస్థానములన్ సమానఘనతన్ జెందున్ బరస్థంబులై
పాయున్, గాన స్వధర్మమే సతము సల్పన్ జూతు రెందున్ప్రజల్॥

మ. ఎపుడున్ బైనయిఁ దోఁచు భేదములు లేకే జాతు లేపారునం
టపహాస్యప్రద, మైనఁ గన్పడు విభేదానీకముల్ లేని స
ర్వపదార్థస్థితసచ్చిదాత్మ, కలతత్వమ్మెంచి యానందపూ
ర్ణపథంబందుఁ బరస్పరప్రియములై రంజింతు రెల్లారలున్। 80

మ॥ సతమున్ భేదములన్ గనంబడుటె నైజంబౌ జగంబందు భే
దతతుల్ బాపి సమంబుసేయుటకు యత్నంబుల్ వృథాయంచు సం
తతమా భేదములన్ మునుంగని యభేదజ్ఞానమున్ నేర్చి ధీ
రత వర్థిల్లెదరే పరస్పరమదేర్ష్యల్లేక ప్రేమాత్ములై. 81

మ. అవివేకంబుఁ బరస్పరేర్ష్యలును గార్ధ్యంబున్ వివాదంబుఁ దృ
ష్ణఁ విడంగల్గి జనుల్ కులంబులును దన్న్యస్తంబులౌ వృత్తు లా
ర్యవినిర్దిష్టవిధానవర్తులుచు నుద్యచ్ఛాంతినే వారుచున్
భువి దారిద్ర్యపిశాచముక్తులయి సమ్మోదింతు రెంతేసియున్॥ 82

కం. న్యూనాధిక జాతులలో
న్యూనాధిక వైభవముల నుండిన జనులన్
మానరు నీచోన్నతమతు
లానందమె కందు రెందు నాభేదతతిన్॥ 83

చ. హృదయములన్ బరస్పరశుభేచ్ఛల భూరివిశాలభావముల్
సదమలతన్ వివేకమును జక్కఁగ నేర్వకయున్న నేకతన్
బొదలఁగఁ జేయ బైపయినిఁ బూనెడి యత్నములెల్ల వ్యర్థమౌ
టఁ దలఁచుచున్ సమత్వముఁ బొడం గననేర్తురు భేదరాజినిన్. 84

క॥ స్థిరుఁడై సుఖకరుఁడై గుణ
వరుఁడై యతులచతురంగబలభాస్వరుఁడై
సురుచిరుఁడై రిపుహరుఁడై
నరవరుఁ డరమరలఁ దొరగి నరులను బ్రోచెన్॥ 85

గీ. సకలసద్గుణములుగల్గి చతురుఁడగుచుఁ
బ్రజలబిడ్డలరీతి, గాపాడుచుండి
వారివిశ్వాసముంబొంది ప్రభుండు ప్రజలు
వలరిరి శిరమ్మునితరావయవము లట్లు. 86

సీ. ఘనసుదర్శనుఁడౌట జ్ఞానధాముఁడునౌట
నగధరుం డతఁడుఁ బన్నగధరుండు
శ్రీశోభితుండౌట జితమన్మథుండౌట
మారతాత మతికుమారతాత

సద్వనమాలియై సదహీనమాలియై
మాధవుండాతడు మాధవుండు
భూరమాధవుఁడౌట భోగదీప్తతవీశ
వాహనుండుఁ గవీశవాహనుండు

గీ. రూక్షవీక్షణమాత్రి సుసిక్షితోగ్రి
ఘనవిపక్షుఁడేయయ్యె దానవవరతము
సకలముని దేవసేవితసచ్చిదాత్మ
నాత్మవీడమి శ్రీధరుం డాతఁడగును. 87

కం. రూపంబు విద్యాజవ్వన
మేపును సద్గుణవితాన మెంతయు నాభూ
మీపతి కులదీపకునం
దేపసనొండొంటిమించి వృద్ధినిఁ బొందెన్. 88

మ. కడుసూక్ష్మంబుగ గ్రీష్మమందు జలమాకర్షించి యాలోకమి
త్రుడు సర్వంబును వానకాలములయందున్ సస్యవృద్ధ్యర్థమై
యిడున ట్లానరపాలుఁడున్ బ్రజలనేమేన్ బన్నులంగొంచు న
య్యేడుమల్ వాపన్యయించి సంతతమురక్షించుఁ సమస్తక్షితిన్.

మ. ప్రజచేతన్ సతతంబు వారలను సంరక్షింపగా నిల్వఁబ
డ్డజనుండంచుఁ దనున్గనున్ నృపుఁడొకంటన్ భూరిభోగాళిసీ
రజపుత్రాత్ములతోడ సన్యవివిధిపాత్రి కామ్యములన్ తీర్చుకో
నజుఁడా వైభవమిచ్చెనంచుఁ దలపోయంబోఁడు స్వప్నంబునన్. 90

మ. అకలంకుండగు నానృపాలకుఁ డమాత్యాచార్యసామంతనా
యకమిత్రాప్తపురోహితాదిపరివారావేష్టితుండైసభన్
బ్రికటపౌఢిమనుండ బోయలును పౌరస్తోమముల్ వచ్చి కా
నుకలన్ దీర్చి సభక్తిమ్రొక్కి వినయానూనాత్ములై నిల్చుచున్.

మ. అమితోగ్రాహివరాహసింహశరభవ్యాఘ్రభభల్లూకఖ
డ్గమహోక్షాదివనాటముల్ మిగులలెక్కన్మీటి యొక్కుమ్మడిన్
స్వమహాకూరత గ్రామసీమలను స్వేచ్ఛన్ జొచ్చితామెల్లచో
ట్ల మదంబొప్పఁ జెలంగుచుంట మొఱవెట్టన్నాథుఁ డాలించుచున్.

ఉ. ఇంతగ క్రూరసత్త్వములు వృద్ధినిఁ జెందెడిదాఁక నేల ర
వ్వంతయు శ్రద్ధఁ దీసికొనరైరని మంత్రులవైపుఁ జూచి గో
రంతకొఁ జింత లేక మృగయార్థము సర్వము నాయితంబుగా
వింతురుగాక శీఘ్రమని వేగమ యానతినిచ్చి యయ్యెడన్. 93

ఆ. అలఘుతమములైన యట్టికార్యావళి
మాత్రిఁ దీర్చి యపుడు మందగతిని
వేఁటఁ గోర్కి సభను నాటికిఁ జాలించె
రణవిజితరిపుండు ప్రభువరుండు,

మ. దరభేరీపణవానకాదులును నుద్యచ్ఛృంగగోవక్త్రముల్
మొరయన్ విండ్లునుఁ గండెలున్ వలలుకుల్ ఫ్రాశేండ్లు గొడ్డంద్రు దు
ర్భరబాణాసనశూలకుంతపరిఘవ్రాతాసిశాతాయుధో
త్కరముల్ గోటరి వేఁటకుల్ గొని మహోత్కంఠన్విజృంభింపఁగన్.

చ. ప్రభుతిలకుండు భూభరణభార మమాత్యులకప్పగించి జం
తుభయమ మాన్చు నుత్సుకత తొందరఁ బెట్ట ప్రభాకరాభస
న్నిభఘనతేజ మొప్ప గణనీయమహోగ్రచమూసమేతుఁడై
సభయముగన్ రిపూత్కరము సందులదూరఁ బ్రయాణమైతగన్.

క. అవనీసురశుభసూక్తులు
నవలాహారతుల తతులు నతజననుతులున్
కవిగాయక సన్నుతులును
నవిరళముగ వెలయ నధిపుఁ డరిగెన్ వనికిన్. 97

క. కతిపయపయనంబుల న
య్యతిలోకపరాక్రమాఢ్యుఁ డరిగి యరిగి యు
ద్ధతిఁ జేరెఁ బుణ్యగణ్యము
నతులమృగశరణ్యమును మహారణ్యమటన్. 98

ఉ. మాటులఁ బెట్టియున్ వలలమాయలఁ బన్నియు మచ్చులుంచియున్.
వాటపుఁ గాపుగాయుచును వన్యమృగప్రకరమ్ములన్ సమ
ద్ఘాటిత చిత్రవాద్యములఁ దత్తిలమున్ విడనాడఁ జేసి యా
రాటమునన్ గలంగి చెదరంగ నొనర్చిరి వేటకుల్ వెసన్. 99

ఉ. కొన్నిటి బాణజాలముల, గొన్నిటి శూలపుఁగోటులన్ గడన్
గొన్నిటి ముష్టిఘాతములఁ గొన్నిటిఁ గ్రూరమృగావళిన్
మహాపన్నతనొందఁజేయుచు నృపాలుఁడు భూరివినోదమొప్ప
వేటన్నడిపించె నిస్తులభటప్రకరంబులతో వనంబునన్. 100

గీ. క్రూరమృగములఁ బెక్కింటిఁ గూలఁజేసి
చెంతవిశ్రాంతిఁగొనఁ జింతసుంత పొడమ
పాదచారియై వనిని నృపాలవరుఁడు
చనియె నొకస్రవంతీతటమ్మునకు తిల. 101

గీ. చెంతనున్నట్టి మునిపల్లెఁ జేరి యచట
దర్శనీయులౌ ఘనులఁ బెద్దలను గొలిచి
భవ్యవిషయాళి నెఱిఁగి దీవనలనొంది
యతులితాకర్షణీయ దృశ్యములఁ గాంచి. 102

కం. సైన్యమ్ములు బరివారము
లన్యులు సచివులును దన్ను నచ్చటఁ జేరన్
మాన్యుఁడు ప్రసాదనరపతి
వన్యస్థలివీడి యరిగి స్వపురోన్ముఖుఁడై. 103

కం. రాకాశశిరాకకునీ
రాకర మేకరణి కెరలు నాకరణిని భూ
మీకాంతురాక కలరి పు
రౌకసు లుప్పొంగి చెలగి రుత్సాహమునన్. 104

చం. మదమునఁ గత్తిఁజూపి కడుమన్ననగన్న నృపుండు కాచెన్
ముదమునఁ బ్రేమఁజూపి మనముల్ గొని యుండిన నేతయౌట స
ద్హృదయము మీరి నెల్లరును దీవన లాంతులిచ్చి పొల్చిరొ
ప్పిదముగు నెమ్మనమ్ములను పెద్దలుఁ బిన్నలు సంతసంబునన్. 105

మ. అకలంకార్థికలౌక్యసాంఘికమహాధ్యాత్మోన్నతాముష్మికై
హికసన్నైతికరాజకీయవిధులం డెంతేనియారోగ్యవ
ర్ధకమార్గంబులఁ దేరఁగా బ్రతినరుం బ్రజ్ఞాన్వితుం జేయుటన్
సుకరంబయ్యెను వారిపాలనము విజ్ఞుండైన యాతనికిన్. 106

మ. సచివశ్రేష్ఠుడు బుద్ధిసాగరుని ప్రజ్ఞాయుక్తిశక్తుల్ స్వకీ
యచమూరాజియునాత్మబుద్ధియు ప్రసాదాఖ్యావనీపాలు శ
త్రుచయార్తి ప్రదుగాగ స్వీయజనసంతోషప్రదుంగానొన
ర్చి చతుర్వార్ధి పరీత కీర్తియుతుఁడై చెల్వొందఁజేసెంగడున్. 107

ఉ. ఎట్టిమనమ్ము లోగొనుచు నిట్టె విశుద్ధనొనర్చి ప్రోచుచున్
జట్టముజేయలేని పని చక్కనిబోధలొనర్చునంచు నా
దిట్ట సుబోధలున్ మిగుల దీప్తిని వ్యాప్తినొనర్చి యెల్లడన్
గట్టిగ నీతిమార్గమునఁ గట్టి దివంబునుఁ జేసె భూస్థలిన్. 108

మ. ఎదినేర్వంగనియున్న నన్యముగు నెన్నోవిద్యలున్ లొంగునె
య్యది నేర్వంగనకున్న నన్యమగువిద్యల్ పూర్ణతంగూర్పవో
యదినేర్వంగని యుంటఁ బెక్కురిహలోకాముష్మికాధ్యాత్మికే
త్థదురూహాంతిసుఖాళి నిచ్చమెయిఁ బొందంగల్గి రొక్కుమ్మడిన్.

మ. బలమున్ రూపము వైభవంబుఁ జలమున్ బ్రాగల్భ్యమున్ గల్గియు
న్నలవంబున్ విషయప్రసక్తి మదమున్ దంభంబునుం బొందమిన్
వెలయున్నింతల వింతయై పతి తొలిన్వెల్గొంచు నయ్యేడు విం
తలకుం దొంటిగ నిల్చి యంచుఁ గడునెన్నం జొచ్చి రెల్లారటన్.

శా. వేదాంతప్రతిపాదితాంచిత మహావిజ్ఞానమార్గంబునం
దేదాంతుండు మనోవచఃక్రియలయం దేపొప్పవర్తిల్లునో
మోదంబాతనిసొమ్మెయై సుగుణముల్ పూర్ణంబుగాఁ నొంది యా
హ్లాదించున్ ఘనశాంతియన్యున కదెట్లబ్బున్ రవంతేనియున్. 111

మంజుభాషిణి: సతతార్తరక్షణవిచారభాసురా!
శ్రుతిమస్తకామ్రజవిశుభ్రమందిరా!
దితిజాళిభీతికరధీరసంగరా!
క్షితిజామనఃకమలచిత్రబంభరా! 112

కవికంఠభూషణము:—

మహనీయదివ్యమహిమాస్థిరతోషితసర్వలోకధీరా
అహితాళిభీకర మహాసమరాంగణనైపుణీవిచారా
తుహినాంశువక్త్రపరితుష్టబహుక్రతుభుజ్మనుష్యవారా
మహిజామనఃప్రియతమప్రతిభాయుతచారుసంచారా!

మంగళంమహాశ్రీవృత్తము:-

అర్క-కులజాతమునియాగజయదాతనగజాధిపశరాసనవిరామా
తర్క-తతిదూరపరతత్త్వసువిచారమహితక్షితిభవాహృదయధామా
కర్క-శవినాశరిపుకాండయమపాశదశకంఠమదభంగకరనామా
మర్క-టపతీశఘనమానిహృదయేశనిగమస్తుతమహాజయరామా.

గద్య:- ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధౌరేయ
కౌండిన్యగోత్రపవిత్ర ముత్యావంశపయః
పారావారరాకాసుధానిలయ కామేశ్వ
రాంబాసూర్యనారాయణార్యతనయ
విబుధవిధేయ శ్రీసుబ్బరాయ
ప్రణీతంబైన నిశ్శ్రేయ
సానందకావ్య మందలి
పంచమాశ్వాసము

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | సకలాప | సక[illegible]వ |
| 3 | 5 | మిత్రజగత్పరితోషతంబు | మిద్ధజగత్పరితోషదంబు |
| 3 | 6 | శాపనిష్ప్రత్పతిపాది | దాగ సుశ్లిష్ట నిబోధ |
| 3 | 15 | యడియాప | యడియాస |
| 8 | 5 | నఘుపొంత | ఘనఘు గాఘనముపొంత |
| 9 | 15 | కోశలఙ | కోసలన్ |
| 9 | 24 | మంతుఙ | మఱతుఙ |
| 10 | 2 | కళఙ | కళల్ |
| 10 | 22 | దిట్టవౌఝూ | దిటమానీ |
| 13 | 11 | ధారిణీతలికిఙ | ధారిణీస్థలికిఙ |
| 14 | 7 | నీరదు | స్నీరద |
| 14 | 10 | ఖజ్యోతనా | ఖద్యోతనా |
| 16 | 4 | గొసి | గొన |
| 16 | 14 | కోమలత | కోమలతర |
| 17 | 14 | ప్రత్త్రాదుల | పుత్త్రాదుల |
| 18 | 6 | కాంచు | కొంచు |
| 18 | 14 | స్త్రీ | నీస్త్రీ |
| 20 | 3 | దుతులిత | దతులిత |
| 22 | 4 | నిశ్శేష్టలై | నిశ్చేష్టలై |
| 22 | 5 | దబ్బృషి | నాఋషి |
| 22 | 23 | నెఱిగు | నెఱుగు |
| 23 | 22 | నిజేసు | నిజేశు |
| 24 | 7 | దద్సంగాన | దత్సంగాన |
| 24 | 16 | లేము | లేదు |
| 25 | 4 | గూర్చునఙ | గూర్చుఙ |
| 27 | 8 | నెవ్వాకిఙ | నెవ్వానికిన్ |
| 27 | 18 | తతాత్మజుఁడు | దదాత్మజుఁడు |
| 28 | 17 | డగ్గి | డద్ది |
| 32 | 19 | దన | గల |

| | | | |
|---|---|---|---|
| 34 | 7 | దరింపన్ | తరింపఁ |
| 34 | 10 | నట్టు | నట్టి |
| 34 | 25 | దృష్టు | దృష్ట |
| 35 | 20 | పూర్ణుడై | పూర్ణుఁడై |
| 35 | 24 | నెండఁ | నెండెఁ |
| 36 | 1 | గణ్వత | గణ్యత |
| ,, | 6 | హానక్రీడ | హననక్రీడ |
| ,, | 18 | మెట్టెఖట | నెట్టెదుట |
| ,, | 19 | బెనంగ | బెనఁగ |
| 37 | 15 | కతల్ | కడఁ |
| ,, | 13 | నత్వోత్సాహి | నత్యోత్సాహి |
| ,, | 16 | జంతాందుర్దుఁ | జందుర్ందుతాఁ |
| 38 | 6 | తుండగా | తుండుగా |
| ,, | 9 | మేతన్నామక | మేతన్నాయక |
| 38 | 16 | జేయ | జేయవు |
| ,, | 16 | చలిమయ | చలితుఁజేయవు |
| ,, | 25 | దశత | వశత |
| ,, | 28 | కన్పడెనంబరవీధి | కానగనవ్యోమువింట |
| 39 | 1 | వర్తనముల | వర్తనముమూల |
| ,, | 24 | రఘూద్వంశ | రఘూద్వంశ |
| ,, | 28 | సృష్ట | స్పష్ట |
| 41 | 9 | చతుర్డు | చరితుర్డు |
| 41 | 22 | న్నన్నర | నన్నర |
| 42 | 2 | నచ్చెనటు | నచ్చినటు |
| 42 | 3 | యాత్మెక్కేశ | యాత్మకెక్క |
| 42 | 20 | వ్యాదిగ | వారిన |
| 43 | 3 | బట్కే | బలుకు |
| 43 | 1 | తదవులనుండీ | తడవులనుండి |
| 43 | 4 | హ్వాధాళి | వ్యధాళి |
| 43 | 4 | వ్యర్దమగు | వ్యర్థమగు |
| 44 | 8 | ముహృదయ | మునిహృదయ |
| 44 | 10 | న్రిశ్శ్రేయనగన్ | నిశ్శ్రేయసఁ |

| | | | |
|---|---|---|---|
| 45 | 1 | యూజ్ఞ | యాజ్ఞ |
| 45 | 1 | నత్మంతముఁ | నత్యంతమున్ |
| 45 | 3 | ధన్వత్వము | ధన్యత్వము |
| 45 | 4 | న్మధుండు | నాథుండ |
| 46 | 1 | సీరియుశౌరి | శౌరియుసీరి |
| 46 | 22 | మఁగ్గుమొనర్చి | నుగ్గునొనర్చి |
| 47 | 22 | రాజ్యామాత్య | రాజామాత్య |
| 48 | 11 | శిద్ధుండో | సిద్ధుండో |
| 49 | 5 | దత్పృిజాని | దత్ప్రజా |
| 49 | 11 | యచ్చటన్ | యచటన్ |
| 50 | 7 | నిమేషంబట్టి | నిమేషంబటి |
| 53 | 1 | బాలికలాట | బాలికవాట |
| 53 | 25 | కికయయి | కిక్కయయి |
| 53 | 27 | మండితుండుగు | మండితుండునగు |
| 54 | 10 | డొక్కుడు | డొక్కుండు |
| 57 | 4 | వచించిరెంత | వచించెనెంత |
| 58 | 3 | నాటిఁగోలె | నాటఁగోలె |
| 60 | 28 | బంపెనుతింపగ | బంపితినుంపగ |
| 62 | 24 | కెల్లారన్గదుఁ | మర్త్యానీకముల్ |
| 64 | 2 | స్నిల్పుచు | నిల్పుచు |
| 64 | 3 | దుస్ఫాధ | దుస్సాధ |
| 67 | 13 | నిక | నిజ |
| 67 | 17 | సమర్పం | నమర్పం |
| 67 | 28 | రెల్లారలుఁ | రయ్యెల్లరుఁ |
| 68 | 12 | జేదతతిన్ | భేదతతిఁ |
| 69 | 5 | సుసిక్షి | సుశిక్షి |
| 70 | 21 | పయనంబుల | గమనంబుల |
| 71 | 5 | కూర | క్రూర |
| 71 | 21 | కాపెన్ | కాకపెన్ |
| 72 | 9 | నెన్వే | నెన్నె |
| 72 | 16 | రెల్లారటఁ | రందెల్లరుఁ |